


అన్నపూర్ణ ఆర్ట్ పిక్చర్స్

# అమాయకురాలు

నిర్మాత D. మధుసూదనరావు B.A.    దర్శకుడు V. మధుసూదనరావు

అన్నపూర్ణ ఫిలిమ్స్ రిలీజ్

# ఉత్తరాలు

## ఓం నమః శివాయ

**7.5.71** సంచికలోని వోం నమః శివాయ గురించి విమర్శనను చదివాను. పద్యాలలో ఛందస్సు లేకపోయినా నాకు ఆలోచించినంతవరకు పద్యాలన్నీ భావ పటిష్టముగానేయున్నవి. రచయిత్రి గారి పద్యాలు వినుటకింపుగా చూడ ముచ్చటగా పదలాలిత్యముతో భక్తి భావమ్మున దేలియాడుచున్నవి. కాని విమర్శనలో అన్నట్లు ఒక పొట్టిలైనా ఒక పొడుగులైనా వ్రాసి కం॥ అని పెడితే పద్యమయి పోతుందా? నిజంగానే కంద పద్య లక్షణాలకు రచయిత్రిగారి పద్యాలు చాలా దూరంగాయున్నవి. ఏమయినా పద్యాల ముందర కం॥ అని చేర్చడం సబబుగాలేదు. కంద పద్య లక్షణాలు గలవే కందాలు, అని అన్పించుకొంటవి. రచయిత్రిగారు కం॥ చేర్చడం వదిలేస్తే ఎంతో బాగుంటుంది.. రచయిత్రిగారు వోర్పుతో పద్యాలు వ్రాస్తున్నందుకు నాహృదయ పూర్వక అభినందనములు సమర్పించుకొంటున్నాను. రచయిత్రిగారు ఈ పద్యరచన అపకుండా ఇలానే సాగించాలని నాకోరిక. రచయిత్రిగారు అన్నట్లు 'నలుగురిలో... నలంకార ఛందస్సులన్' ఈవిధంగా అన్నారు చాలా బాగుంది. అలంకార ఛందస్సుల నిర్జించినప్పుడు పద్యముల ముందర కం॥ చేర్చకుండా వుంచేనే బాగా యుంటుంది. రచయిత్రిగారు కం॥ చేర్చకుండా స్వేచ్ఛగా కవితా గానము చేసుకోవచ్చునుగదా అని వ్రాసినందుకు అన్యథా భావించరని రచయిత్రిని ప్రార్థిస్తున్నాను.

మోహనపు రామచంద్రరాజు (యాళ్ళూరు.)

*　　*　　*

**21—5—71** తమ వారపత్రిక ఉత్తరాల శీర్షికలో 'వోం నమః శివాయ' రచయిత్రిపై మహబూబ్‌నగర్ నుండి శ్రీ పి. సూర్యనారాయణ వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఏకీభవించే వారుండరని విశ్వసిస్తున్నాను.

రచయిత్రికి తమ పత్రిక యిచ్చినదంటున్న పబ్లిసిటీకంటె విమర్శకులకు రచయిత్రిపై నున్న అసూయాద్వేషాలు శృతిమించి యున్నట్లు వారి విమర్శ స్పష్టంగా చాటుతున్నది. వోర్పులేని తనంతో కూడిన విమర్శను తామెందుకు ప్రచురించారో! ఒకవిధంగా తాము అభినందవార్హులు!

నేను కవిని కాను! అంతకంటే పండితుణ్ణి కాను! ఒక సామాన్యుడను! 'వోం నమః శివాయ' రచనలలో తిక్కన, పోతనల పోకడల పాకం కొట్టవచ్చినట్లు స్ఫురిస్తున్నదని మాత్రం చెప్పక తప్పదు! పెద్దలీ సత్యాన్ని ధృవపరుస్తారని ఆశిస్తున్నాను. 'రాష్ట్రపతి భార్య' అనేది విస్మరించి ఆమె రచనలలోని చేవను ప్రకటిస్తారని విశ్వసిస్తున్నను.

మరో మాట చెప్పక తప్పదు! ఈ సంకుచిత అసూయాగ్రస్త కువిమర్శకుల బెదరింపులకు తాముకాని, రచయిత్రి కాని జంకులారననోను! 'ఆవిడ రచనలోని లోపాలు ఆవిడకే ఎత్తి చూపుతాను' అంటున్నారు.

ఆవిడ రచనలలోని యే తప్పును (రాష్ట్రపతి భార్యగా తప్ప!) వీరు చూపదలచారో! రసోత్పాదితమైన వాక్యమే కావ్యమని సాహిత్య వాఙ్మయం చెబుతున్నది! ఛందస్సు వగైరా సనాతనుల అష్ట దిగ్బంధనాలు ప్రజాసాహిత్యానికి గుదిబండగా తయారయ్యాయని ఆధునికు లంటున్నారు! ఈ విమర్శకులు ఆధునికులా! సనాతనులా! లేక రెంటికీ చెడ్డ...

చార్వాకుల రెడ్డెప్ప (కలికిరి.)

## క థ లు

ఈ వారం (14. 5. 71) మీరు ప్రచురించిన నమ్మకం అన్న కథ నాకెంతో నచ్చింది. విజ్ఞానశాస్త్రం ఎంతో ముందంజ వేసిన ఈనాడు కూడా, కొంతమంది అమాయక ప్రజలు సూరయ్యలాటి వ్యక్తులకు లేనిపోని గొప్పతనం అంటకట్టి, వారిని దేవునిలా కొలుస్తుంటే వారి అమాయకత్వానికి ఎంతోజాలి, బాధ కలుగుతాయి.

ఈ వారమే ప్రారంభమైన క్రొత్త సీరియల్ ముగింపు మీకు తెలుసు, ప్రారంభములోనే ఎంతో ఆసక్తికరంగా ఉన్నది.

యు. రామకృష్ణ, (ఏలూరు.)

*　　*　　*

ఈవారం (7.5.71) ప్రచురించిన కథలలో అమార్ బంగ్లాదేశ్ ఉత్తమమయినదిగవుంది. రచయితలు యిప్పటి బంగ్లాదేశపు పరిస్థితిని పాటకులకు కథద్వారా బాగా తెలియపరచారు.

ఎస్. వి. ఎస్. గాంధి. (ఖరగ్‌పూర్.)

## గ మ ని క

ఈ సంచికలోని 40వ పేజీలోని కార్టూన్ కింద 'వచ్చే జన్మలో జపాన్‌లో పుట్టేట్లు చెయ్ భగవంతుడా!' అని ఉండాలి. పాటకులు గమనించ కోరుతున్నాము. —సం॥

పైవారమే ప్రారంభం!

కొత్త సీరియల్

**ఈ దారి ఎక్కడికి?**

రచన

శ్రీమహీధర రామమోహనరావు


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 4—6—'71

శ్రీ విరోధికృన్నామ సం॥ జ్యేష్ఠమాసం శు॥ ఏకాదశి

సంపుటము: 64　సంచిక: 39

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి జమున

చివరి అట్ట పేజీలోని చిత్రరచన:
శ్రీ జి. వెంకట్రావు

రాజధాని కబురు

# ప్రపంచ థియేటర్ కాంగ్రెస్‌కి వెళ్లిన భారతీయ నాట్యసంఘం ప్రతినిధులు

అన్నిరాష్ట్రాల్లోను నాటకరంగ కార్యకలాపాలు బాగా జరుగుతూ ఉండవచ్చును. తమిళనాడు లాంటి రాష్ట్రాలలో రాజకీయ ప్రచారం కోసం, నాటకాలు శక్తివంతమైన సాధనంగా ఉపయోగ పడుతూ ఉండవచ్చును. పటిష్ఠమైన వ్యవస్థతో ఒక ఉద్యమంగా నాటకరంగం ముందుకు పోతున్నది, మనరాష్ట్రంలోనేనని చెప్పవచ్చు ననుకుంటాను. భారతీయ నాట్యసంఘానికి అన్నిరాష్ట్రాల్లోను శాఖలు ఉన్నాయి. కాని ఆంధ్రప్రదేశ్ శాఖకున్న కార్యకర్తల సంఖ్య చాలా హెచ్చు అనడానికి భారతీయ నాట్యసంఘంలో ఆంధ్ర కార్యకర్తలు పి. ఆర్. కృష్ణ లాంటి వారికున్న పలుకుబడి తార్కాణంగా చూపవచ్చును. అంతేకాదు ఈసారి లండన్‌లో యునెస్కో ఆధ్వర్యాన జరుగుతున్న ప్రపంచ థియేటరు కాంగ్రెసుకు భారతీయ ప్రతినిధులు పదుగురిలో ఐదుగురు ఆంధ్రులే.

ఈ ఐదుగురు శ్రీ పి ఆర్ కృష్ణ నాయకత్వాన మే 21న లండన్ పయనమై వెళ్లారు. కృష్ణగారు ఆంధ్ర ప్రతినిధులకే కాక భారతీయ ప్రతినిధి వర్గానికే నాయకుడు ఆయన భారతీయ నాట్య సంఘం ప్రధానకార్యదర్శి కనుక ఈ బాధ్యత ఆయనపై పడింది. శ్రీ పి. నాగభూషణం (సినీ నటుడు, రక్తకన్నీరు ఫేమ్) డి. కె రావు, తుమ్మల సీతారామమూర్తి, కుమారి రత్నపాప ఆంధ్ర నుంచి వెళ్లిన మిగతా నలుగురు ప్రతినిధులు. లండన్ సమావేశాలు వారంరోజుల పాటు మాత్రమే జరుగుతాయి. ప్రతినిధివర్గంలోని డి. కె. రావు ప్రభుత్వ ఈ సందర్భంలో ఇతర యూరోప్ దేశాలను కూడా సందర్శించి అక్కడ రంగస్థలాలను పరిశీలించి, రంగస్థలం కళగాను సాంకేతికంగాను పొందిన అభివృద్ధి గూర్చి తెలుసుకుంటారు.

## వీడ్కోలు

రవీంద్ర భారతిలో మే 20 న జరిగిన నాట్య విద్యాలయం దీక్షోత్సవం సందర్భంలో ఈ ఐదుగురు ప్రతినిధులకు ఘనంగా వీడ్కోలిచ్చారు. నాట్య విద్యాలయ మొదటి డైరెక్టరు అబ్బూరి రామకృష్ణ రావుగారు సభకు అధ్యక్షత వహించారు. ప్రదేశ్ నాట్యసంఘం అధ్యక్షుడు శ్రీలం సిద్దారెడ్డిగారు కూడా సభలో పాల్గొన్నారు. ఈ ప్రతినిధులంతా విదేశాల్లో నాటకకళ పొందిన పురోగతి గూర్చి తెలుసుకొని, ఆంధ్ర నాటక కళాభ్యున్నతికి తోడ్పడాలని సభలో పలువురు వెలిబుచ్చిన అభిప్రాయాలకు నాగభూషణంగారు తమ సహజ ధోరణిలో ఛలోక్తులతో సమాధానం చెప్పారు. మేమక్కడ ఉండబోతున్నది వారంరోజులు, ఈ స్వల్ప కాలంలో అక్కడి నాటక రంగాన్నంతా పరిశీలించి వారి పద్ధతులను సాంకేతిక నైపుణ్యాన్ని అధ్యయనం చేయగలుగుతా మనుకోవడం పొరపాటు. కనుక మేమేదో తెలుసుకొని రాబోవడం లేదని ఖచ్చితంగా హామీ ఇస్తున్నామని నాగభూషణంగారు చెప్పారు. ఐతే భారతదేశం ఒకటుందని అందులో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో నాటక కళ గూర్చి కృషి జరుగుతున్నదని మాత్రం అక్కడివారు తెలుసుకునేట్టు చేసి వస్తామన్నారు.



లండన్‌లో జరుగుతున్న ప్రపంచ థియేటరు కాంగ్రెసుకు భారతీయ నాట్య సంఘం ప్రతినిధులు పదిమందిలో ఐదుగురు ఆంధ్రులు. ప్రతినిధి వర్గానికి పి. ఆర్. కృష్ణ నాయకుడు. ఎడమనుంచి కుడికి—నాగభూషణమ్, కుమారి రత్నపాప, తుమ్మల సీతారామమూర్తి, డి. కె. రావు.

## విజయవాడలో నాట్య సంఘటి

హైదరాబాదులోని నాట్య విద్యాలయానికి పదేళ్ళు నిండాయి. దీన్ని ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం స్థాపించిందని పాఠకులకు తెలుసు. ఇలాంటి విద్యాలయాన్నే విజయవాడలో ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని శ్రీ పి. ఆర్. కృష్ణ చెప్పారు. మే 21 నాటి సభలో విద్యాలయంలో శిక్షణ పొందిన వారికి డిప్లొమాలు బహుమతుల ప్రదానం కూడా జరిగింది 'నాట్య విద్యాలయ నిర్వాహక సంఘం అధ్యక్షులైన డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావుగారు విద్యాలయం విద్యార్థులకు నాటకకళలో ఆసక్తిగా నున్న వారికి ఉపయోగపడే టందుకు నాటకకళకు సంబంధించి రెండు పాఠ్య గ్రంథాలను వ్రాశారని ఈ సందర్భంలో పి. ఆర్. కృష్ణగారు వెల్లడించారు. తెలుగులో ఇలాంటి పాఠ్యగ్రంథాలు వెలువడడం ఇదే ప్రథమమని చెప్పవచ్చును.

ఈ ప్రదానోత్సవం సందర్భంలోనే విద్యాలయ రిపర్టరీకి చెందిన విజయవాడ బృందంవారు ఇనుప తెరలు నాటకాన్ని ప్రదర్శించారు ఈ నాటకాన్ని, జె. బి. 'ప్రీస్ట్లీ ఇన్‌స్పెక్టర్ కాల్స్' ఆధారంగా కొప్పరపు సుబ్బారావు గారు తెలుగులో వ్రాశారు. కొందరు పాత్రల సంభాషణలు ఉపన్యాస ధోరణిలో నున్నప్పటికీ, నాటకం ఇతివృత్తం మూలంగా నైతే నేమి, నటీనటులు చూపిన శ్రద్ధాసక్తుల మూలంగా నైతేనేమి, చక్కగా ఉంది. 'చో' వ్రాసిన 'తుగ్లక్' నాటకాన్ని తెలుగులో చాలాసార్లు ప్రదర్శించారు. దీన్ని రిపర్టరీ నాటకంగా ఆంధ్రప్రదేశ్ అంతా ప్రదర్శించాలని నాట్యసంఘం వారు కృషి చేస్తున్నారు. నాటకం పాఠంలో మార్పులు చేర్పులు కూడా చేస్తారట. ఆధునిక నాటకాల ప్రదర్శనలు ఈమధ్య ఎక్కువ జరుగుతున్నప్పటికీ డబ్బుపెట్టి టికెట్లు కొని చూసే ప్రేక్షకుల సంఖ్య చాలా తక్కువ. 'రక్తకన్నీరు' లాంటి ఒకటి రెండు తప్ప సాంఘికాలు వాణిజ్య రూపంలో విజయవంత మయేవి లేవు. 'తుగ్లక్' నాటకాన్ని ప్రజాభిమాన యోగ్యంగా ప్రదర్శించి ప్రేక్షకులు టికెట్లు కొని నాటకాన్ని పోషించేట్టు చేయాలని వారి సంకల్పం.

నిరుడు కుంభవృష్టి మూలంగా నగరంలో నున్న కలవలు చెరువులు కట్టలు తెంచుకొని పొరలడం, పలువురు మరణించడం, అపారమైన ఆస్తినష్టం కలగడం, రోడ్లు దెబ్బతినడం అందరికీ తెలిసిందే. దీని తరువాత నగరంలోని కాలువ లన్నింటినీ, నగరవాసులకు ప్రమాదం కలిగించే

కుంటా మరమ్మతులు మార్పులు చేయడానికి తగిన సిఫార్సులు చేయమని ప్రభుత్వం ఒక ఇంజనీర్ల సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఈ సంఘం నివేదిక ఇంతవరకు వెలువడ లేదు. ఇంతలో మళ్ళీ వర్షాలు మొదలయాయి. ఈ సారి కాస్త ముందు గానే వర్షాలు ప్రారంభమయాయి. క్రితం వారం వచ్చిన వాన ఒకగంట కొరకే ఐనా, భీభత్సంగా ఉందంటే అతిశయోక్తి కాదు. నిరుటి వరదల వల్ల సొంగి పొరలి ఎంతో నష్టానికి కారకమైన అఫ్జల్‌సాగర్ కాలవ మళ్ళీ ప్రజలకు భీతి గొల్పే ట్టుగా తయారవుతున్నది. ఈ కాలవకు అటూ ఇటూ నివసిస్తున్న నగరవాసులు ఈమధ్య ఉప ముఖ్యమంత్రి జె. వి. నర్సింగరావు గారికి ఒక విజ్ఞాపన ఇస్తూ, తాము పడుతున్న బాధలను వివరించారు. ఈ కాలవ నీటితో ఎక్కువగా ప్రమా దానికి గురయ్యేది మాలకుంట ప్రాంతం. వీళ్లకు అసలు వర్షాకాలం వస్తున్నదంటేనే భయం. అసలే ఇది మురికి కాలవ. వర్షం పడితే ఎగసరి మురికి నీరంతా, ఇళ్లలోకి గుడిసెల్లోకి పోతుంది. దుర్గంధం వల్ల కలిగే నష్టం వేరు. ప్రజల ఆరో గ్యానికి ఇది ఎంత దారుణంగా పరిణమిస్తుందో చెప్పనక్కర లేదు. ఎన్నిసార్లు దీని విషయమై ప్రభుత్వానికి మున్సిపల్ కార్పొరేషన్ వారికి మొర పెట్టుకున్నా ఫలితం లేకపోయిందని మాల కుంట ప్రజలు తమ విజ్ఞాపనలో పేర్కొన్నారు.

ప్రధానమైన నగరాన్ని ఆనుకొని కొత్త కొత్త పేటలు హవుసింగ్ బోర్డు వారివి, సహకారసంఘాల వారివి ఎన్నో వెలిశాయి. వీటిలో కొన్నింటిలో మంచి రోడ్డులు కాని, సరిపోను నీటి వసతి కాని లేదు. కొన్ని పేటల్లో రోడ్లు వేయడం కాని వేసిన రోడ్ల మరమ్మతులు ఎవరు చేయాలనే విషయమై హవుసింగ్ బోర్డు వారికీ కార్పొరేషన్‌కు మధ్య వివాదం కూడ ఉంది. మాకు దఖలుపరచని రోడ్ల నిర్వహణ మేమెలాచేస్తామని కార్పొరేషన్ వారంటారు. మొత్తంమీద ఈ పేటల్లో నివసించే వారికి మంచి రోడ్ల సౌకర్యం లేకుండా పోతున్నది. క్రితం వరదల తరువాత కొన్ని రోడ్లు మరీ పాడై పోయాయి. కంకర రాళ్లన్నీ బైటికి వచ్చేసి బాటసార్లకు వాహనాలకూ ప్రమాదకరంగా తయా రయాయి. ఈమధ్య కొన్ని రోడ్ల పైన మొరమ్ పోసి మరమ్మతు చేశామనిపించారు. క్రితం వారం వర్షం రావడం దానితో ఈరోడ్లు మళ్ళీ పాడు పడిపోవడం జరిగింది. వీటి మరమ్మతు మళ్ళీ ఎప్పుడో తెలియదు. ఒకప్పుడీ నగరం విశాలమైన, కాంక్రీట్ రోడ్లకు పెట్టింది పేరుగా ఉండేది. ఏ బృహత్ ప్రణాళిక లేనిదే రోడ్లు బాగుపడేట్టు కనిపించడం లేదు. ప్రభుత్వం వలె కార్పొరేషన్ కూడా నిధులు లేక అవస్థ పడుతున్నది. ప్రభుత్వం అప్పుడప్పుడు ప్రత్యేక గ్రాంటులు ఇచ్చినా, కార్పొ రేషన్ అడిగిన దానికీ లభ్యమైన దానికీ వ్యత్యాసం చాలా ఉంటుంది.

—వి. నాగేశ్వరరావు.

# ఒక వారం విపరీతం ఫాలాక్షుడు

## అన్నివేళలా అసభ్యం కాదు!

నగ్నవృత్యాలు— శరీరానికి పై భాగంలో ఆచ్ఛాదన లేకుండా చేసే డ్యాన్సులు, క్రింద భాగంలో అచ్ఛాదనలేకుండా చేసే నృత్యాలూ అన్ని వేళలా 'అసభ్యకరమైన నృత్యాలు' అని అనడానికి వీలులేదని కాలిఫోర్నియాకు చెందిన శాక్రమెంట్ కోర్టు ప్రకటించిందట—ఎంకరేజింగ్!!

## దొంగసొమ్ముతో దేవుళ్ళకి విరాళాలు

దేశానికంతటికే వన్నెతెచ్చే దొంగతనం మధుర సెంట్రల్ బ్యాంకులో జరిగింది. ఈ దొంగతనం చేసిన ముఠా రావ్‌జీ నగర్‌లోని చక్కని భవనాల్లో వుండేదట. కొన్నాళ్ళపాటు ఆబ్యాంకు స్థితిగతులు, విషయాలు, సమాచారం సేకరించారట. తమ పథకం నెరవేర్చుకున్నారు. వారిలో ఒకవ్యక్తి ఆ బ్యాంకు నౌకరువేసుకొనే బట్టలవంటి బట్టలు తొడుక్కొని క్యాషియరుకు దగ్గరలో ఉన్నాడట. మరో అయిదుగురు వ్యక్తులూ వచ్చి, అంతా సరిచూసుకున్నారట. ముఠా నాయకుడు కన్ను సౌంజ్ఞ చేసేసరికి క్యాషియరు బల్లమీద పెట్టుకున్న 90 వేలరూపాయల కట్ట పట్టుక్కొని మటుమాయంచేసి వారంతా అంతర్ధానమై పోయారట. ఇదంతా రెండు మూడు నిముషాల్లో అయ్యే పోయిందట. అనక ఈ ముఠా అంతా తమిళనాడు, కేరళ, మైసూరు రాష్ట్రాలు విహారయాత్రలు చేశారట. తమ దైవభక్తిని చాటుతూ మధుర మీనాక్షి దేవాలయం హుండీలో మూడు వేలు, తిరుపతి వెంకటేశ్వరుని హుండీలో ఐదు వేలు, రంగనాధస్వామి హుండీలో మూడువేలు, తిరుపరంకుంద్రం సుబ్రహ్మణ్యేశ్వరుని హుండీలో రెండువేలు—మొత్తం 13 వేలు కానుకలు చెల్లించారట. వారు వేసిన డబ్బు దొంగడబ్బు అయినా హుండీలో వేయడం వల్ల అది భగవంతునికి చెందుతుందని కనుక తామది తీసుకో వీలుండదని పోలీసు అన్నదట. పోలీసుకు మాత్రం భక్తి తక్కువా ఏమిటి విషయంలో!



## రైల్వేస్టేషన్‌లో కాపరం

తను అనుకున్నది సాధించి తీరాలనే పట్టుదలతో బులీషా అనే ఆమె తన ఎనిమిదేళ్ళ కొడుకుతో ఢిల్లీ రైల్వేస్టేషనులోనే కాపరం పెట్టిందట. ఆమె పట్టభద్రురాలట. ఆమె భర్త వజ్రాల వ్యాపారట. ఆయన ఒకామెను తెచ్చుకు పెట్టుకుని, బులీషాను వదలి పెట్టాడట. దాంతో బులీషా భర్త మీద భరణానికిగాను కోర్టులో దావా వేసిందట. చివరికి సుప్రీంకోర్టు వరకూ కూడా వెళ్ళిందట. కేసు తేలే వరకూ తాను ఢిల్లీ స్టేషనునే యిల్లుగా పెట్టుకుందట.

## పాముని కరచిన కుక్కలు

నాగపూరులో ఒక ఇంట్లో నాలుగడుగుల పామును చూసిన ఒక కుక్క వెంటనే ఇంట్లోకి గెంతి, ఆ పాము తలను టక్కున పట్టుకుందట. పాము మెలికలు తిరిగి, ఆ కుక్క మెడను పెలి పెట్టేసరికి ఇంకో కుక్క ఆ దృశ్యాన్ని చూసి తన జాతిని రక్షించుకోడానికి ఆ పాము మీదకు దూకి, పోటీతో కరచి కరచి చంపేసిందట.

## కాలుతున్న చితిపై దూకినవ్యక్తి

ఢిల్లీ ఆజాంఘర్‌కు చెందిన 38 ఏళ్ళ మోతీరామ్ అనే ఆయన స్మశానానికివెళ్లి కాలుతున్న ఓ చితిలో ఎగిరిదూకేశాడట. ఆ చితిలో కాలుతున్న 75ఏళ్ళ వృద్ధుని శవానికీ అతనికీ ఏవిధమైన బంధుత్వమూ లేదట. చుట్టుపక్కలవారు స్మశాన కాపరులు అయన్ని బయటకు లాగారుట. ప్రమాద స్థితిలోవున్న మోతీరామ్ స్థితి మెరుగయ్యాక అసలా అఘాయిత్యం ఎందుకు తలపెట్టాడో ఆయనని అడగాలని పోలీసు అన్నదట.

## పట్టపగలు దోపిడీ

ఢిల్లీ ఆసఫ్ ఆలీరోడ్డు గాద్రెజ్ బాయిస్‌కంపెనీలోకి నాలుగోతేదీ సాయంత్రం 4—45 లకు ఆకుపచ్చని ఎంబాసిడర్ కారులో కొంతమంది వచ్చి ఫట్టున పిస్తళ్ళు, కత్తుల్లాగా చూపించి, 'సైలెన్స్' అన్నారట. అనక ఇనప్పెట్టె తాళాలు ఇవ్వమని క్యాషియరు నడిగి ఇవ్వడానికి ఆలస్యం చేసినందుకాయన్ని పొడిచి, 3500 రూపాయలు తీసుకుని, అడ్డొచ్చిన మరో మనిషిని కూడా పొడిచి, పారిపోయారట.

## పాకిస్తాన్ సైనికుల కిరాతకాలు

దినాజిపూర్‌లోని ఓ చర్చిలో శాంతి ప్రార్థనలు చేసుకుంటున్న ఓ క్రిస్టియన్ ప్రీస్టును పాకిస్తాన్ సైనికులు మే ఒకటవ తేదీన అమానుషంగా వధించి చంపేశారట. సిలను ప్రభుత్వానికిచ్చిన మాటను మీరి, బంగ్లాదేశ్ లోవున్న బౌద్ధ మతప్రచారకులను కూడా పాకిస్తాన్ సైనికులు చంపేస్తున్నారట. ఈ దారుణ హింసాకాండను, జన నాశనాన్ని ఆపకపోతే తాను నిజంగా నిరాహారదీక్ష నవలంబిస్తానని పాక్ ప్రసిడెంటు యాహ్యాఖాన్ భార్య తన భర్తకు తెలియజేసిందట. బంగ్లా స్వాతంత్ర్య పౌరుడు బషీర్ అనే అతన్ని పాకిస్తాన్ సైనికులు రోడ్డుపక్కనవున్న చెట్టుకు వురి తీసి, 'ఇస్లామాబాద్‌ను వ్యతిరేకించిన వారికిదే శిక్ష' అని అతని మెడకో కాగితం రాసి తగిలించారట. ఇది దిమ్లా గ్రామంసంఘటన. పాకిస్తాన్ జిందాబాద్ అనమంటే అననందువల్ల జగదీష్‌పూరులో 40 మంది గ్రామవాసులను మండే మంటల్లోకి తోసేశారట పాక్ సైనికులు. ఇదే పద్ధతిలో నబీనగర్‌లో 50 మందిని కాల్చి చంపేశారట—ఓం శాంతిశ్శాంతిః

* * *

ఆర్కోణంలో మణవాళన్ అనే అతనికి, అతని భార్య ఇంద్రాణికి మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమనేదట. దీన్ని భరించలేని ఇంద్రాణి తన ఎనిమిది నెలల పసికందును ఎత్తుకుని, 'గుడికెళ్ళొస్తాం' అని చెప్పి నేరుగా ఓ నూతిలో ఆ పసిగుడ్డును పడేసి, తనూ దూకేసిందట. తెల్లారి రెండు శవాలూ తేలాయట.

## కోపానికి కారణం?

మద్రాసు సెక్రటేరియట్‌లోని ఒకవ్యక్తి ఆఫీసు చూడవచ్చిన తమిళనాడు ముఖ్యమంత్రి కరుణానిధి మీదకో ఆఫీసుఫైలు హఠాత్తున విసిరాడట. వెంటనే రక్షకభటులాతన్ని పట్టుకున్నారట. కానీ ఆవ్యక్తి అంతకుముందే నల్లుల మందు త్రాగేసి తన గమ్యాన్ని స్థిరం చేసేసుకున్నాడట. ఇంతకీ అతని కసలంత కోపం ఎందుకొచ్చిందో తెలిసినట్టు లేదెవరికీ.





# పుష్కలమైన పంటలకు ఫాక్టమ్‌ఫాస్

అన్ని రకముల భూములకు, పైర్లకు, అనుకూలమై తన ఆధిక్యతను నిరూపించు చున్న అద్భుత సంకీర్ణ ఎరువు. దక్షిణ ప్రాంత రాష్ట్రముల రైతులు విరివిగా వాడు ఎరువు. భారత దేశంలో రసాయన ఎరువుల ఉత్పత్తికే పునాది వేసిన బ్రహ్మాండమైన ప్రప్రథమ ఫాక్ట్ ఎరువుల ఫాక్టరీ ప్రతిష్ఠను చాటే ఎరువు.

వరి పైరుకు శిఫారసు చేయబడ్డ ఎరువుల మోతాదులు. ఎకరాకు కిలోగ్రాములలో

| | ఫాక్టమ్‌ఫాస్ 16 : 20 | మ్యూరియేట్ ఆఫ్ పొటాష్ | యూరియా |
|---|---|---|---|
| వరి : | | | |
| (ఏ) అధిక దిగుబడినిచ్చే రకాలు | 180 | 60 | 58 |
| (బి) దేశవాళీ రకాలు | 133 | 26 | 12 |




ఫాక్ట్ కర్షక బంధు

**ది ఫర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ ట్రావెన్‌కూర్ లిమిటెడ్, ఉద్యోగమండల్-కేరళ**

ఆంధ్రప్రదేశ్ ఏరియా ఆఫీసు : 5-4-5 & 6, పదంవిల్లా, జవహర్‌లాల్ నెహ్రూ రోడ్, అబిడ్ సర్కిల్, హైదరాబాద్-1. (ఏ.పి.)

ప్రాంతీయ కార్యాలయాలు : నిజామాబాద్, వరంగల్, హైదరాబాద్, నెల్లూరు.

aries EKM. FT 153 IL

## ఒకవారం విపరీతం

### విడిదియిల్లు కూలి పదముగ్గురి మరణం

సికార్‌కు చెందిన రేవస అనేఊర్లో వో పెళ్ళివారు ఊరేగింపయి, ఆడపెళ్లివారిచ్చిన విడదిలోకి ప్రవేశించేసరికి ఆ యిల్లు పెళ్లున కూలిపోయిందట. దాంతో 13 మంది చనిపోవడం, 30 మందికి పైగా గాయ పడడమూ, జరిగాయట. మ్యారేజెస్సార్ మేడిన్ హెవెన్ సార్!!




### జోకులు కానివి

మున్షీ నగర్‌లో జరుగుతున్న అఖిల భారత కాంగ్రెసు (పాతది) సభలకు వెళ్లిన సంజీవరెడ్డిని గుర్తించని వాలంటీర్లు ఎవరు మీరు అని అడిగి నిజలింగప్ప ఎక్కడ మకాం చేశారో చెప్పమంటే 'నాయకుల విషయం మీకనవసరం.' అన్నట్టు మాట్లాడారు. ఈలోగా డాక్టరు చందూర్రు వచ్చారట. తనకు వేరే మకాం ఏర్పాటుకాలేదని చెపుతూ, 'మీ మకాంలోవుండనా,' అని చందూర్‌ను అడిగితే, 'నా రూములో ఒకటే మంచం వుంది.' అని ఆయన అన్నారట. తత్కారణంగా సంజీవరెడ్డి వేరే వో హోటలులో రోజుకు 65 రూపాయల అద్దెమీద వున్నారట.

ప్రపంచంలోని బీదరికానికి, దారిద్ర్యానికి నిరసనగా లండన్ ట్రఫాల్గర్ స్క్వేర్‌లో 66 ఏళ్ల బిషప్ ఒకాయన గడ్డితిని, తద్వారా తన బాధను వ్యక్తం చేశారట.

పశ్చిమ పాకిస్తాన్‌లో తమలపాకు ఒక్కొక్కటి రెండు రూపాయలు— కొండొకచో మూడు రూపాయలు కూడా అమ్ముతోందట. ఈ వ్యాపారంలో లాభం లాగేద్దామని వో వ్యాపారి ఢిల్లీ నుంచి కెనవెవు అనే వూరికి కొన్నిబుట్టలు తమలపాకులు పంపితే కస్టమ్స్‌వారు పసిగట్టి వాటిని పట్టేసి వేలం వేశారట.

టి. కె, ఖర్గపూర్

రోజురోజుకీ మరీ ఎక్కువ అయి పోతూందండీ ఫాషన్ మీ ఆడాళ్ళకి!

ఏం చేస్తాం భాయీ, చూసే కోతులుంటే ఆడే కోతులు ఎక్కువ అవుతాయి.

ఎస్. జె. ఎల్, హైదరాబాదు

మీ పెళ్ళిళ్ళు ఇప్పట్లో మారవనుకుంటు న్నారా ?

నాలాంటోళ్ళే అలాగే వుంచి చిట్టితల్లీ!

తమిళులు చాలా తెలివైన వాళ్ళని అంటారు. నిజమేనా?

నిజమే. మనతో మధ్య తరగతి గృహిణి అంటే కుప్పేపూసా మినహా ఏమీ ఉండదు. ఉన్నా అడపా తడపా మార్వాడీ కొట్టుకెళ్ళి రావలసిందే. అదే తమిళ మామీనీ చూడండి. ఇంట్లో తిండి వుందా లేదా తెలియదు— మనిషి నిండుగా వుంటుంది— రవ్వల దుద్దులు, కనీసం రెండు పట్టుచీరలు—మన తెలుగువాడి సంపాదన 90 శాతము తిండికే అయి పోతుంది. అరవ వారికి 30 శాతము కూడ తిండికి అవదు. కాల్చిన అప్పడం ఒరుగులపులుసూ ఎన్నాళ్ళైనా తింటుంది మామీ. అదే రెండోపూట వంకాయకూర వేస్తే కంచం విసురుతాడు తెలు గయ్య!!—మనం ఖర్చు ముందు చేస్తాం, వాళ్ళు నిదవ ముందు చేసి తరవాతే నెల కర్చులు చూస్తారు. ఇప్పుడు చెప్పు— వాళ్ళు తెలివైన వాళ్ళే కదూ?

వి. ఆర్. కె. గూడూరు

ఏమండీ ఆడవాళ్ల ఉద్యోగంపై మీ అభిప్రాయం ఏమిటి ?

అవసరం కొద్దీ ఉద్యోగాలు చేసేవాళ్లే ఎక్కువ మనకు. అందుచేత అవసరానికి అభిప్రాయంతో పని వుండదు.

వై. ఎవ్. ఎన్, కొమరిగిరిపట్నం

మీరు తీరిక సమయాల్లో ఏం చేస్తూ వుంటారు? అయినా మీకు తీరికవేళ అనేది వుంటుందా ?

ఏమిటి మీ ఉద్దేశ్యం? ఆడవాళ్ళకి తీరిక లేకుండా ఎలా ఉంటుంది? అందులోనూ ఉద్యోగం లేని నాలాంటి దానికి. ఎండాకాలం అయితే అప్ప డాలూ వడియాలూ ఒరుగులూ పెడతాను. వానా కాలం అయితే దుప్పట్లూ అవీ రిపేరు చేస్తాను. పిల్లలు ముసురు వేళ నమలడానికి జంతికలూ కారప్పూస లాంటివి చేసి పోస్తాను. ఇక ఎప్పుడు రాస్తావనా మీ ప్రశ్న? ఉదయం పిల్లలు లేవక ముందు, మధ్యాహ్నం రెండుకీ నాలుక్కీ మధ్య అంతే మిగిలినదైమంతా నాదే— దాన్నే తీరిక అంటారు.

కే. ఆర్. ఆర్, శృంగవృక్షం

పెద్దూటివారు పచ్చగా సుఖంగా ఉంటే ఓర్వలేనివారిని ఏమనాలి ?

ఎన్నోమాటు మనుషులు అన్ని

# ప్రశ్నోత్తరం

...కె. రామలక్ష్మి...

జె. ఎస్, వెల్లటూరు

సినిమాలు చూడ్డం వినోదము కోసము కదా?

అంతే! కాని సరదాకి సినిమాలు చూస్తాం అనడం ఫాషన్ కాదు. క్లాస్ పిక్చర్సనే చూడ్డం, వాటిగురించే మాట్లాడ్డం, వినోద ప్రధానమైనవి పశుప్రాయులే చూస్తారనుకోవడం చాలా మంది పెద్దలు అనుకునే ధోరణి. వినోదంతోపాటు ఏదైనా మిళాయిస్తే భరించవచ్చుగాని, క్లాస్ పేరుతో అర్థ చీకటి సినిమాలూ, కుళ్ళూ దారిద్ర్యం మాత్రమే చూపిస్తే వాటిని సినిమా అనకూడదు— డాక్యుమెంటరీ అనాలి.

ఎ. ఎమ్. ఆర్, సూళ్ళూరుపేట

మీరిలా అతి చమత్కారంగా జవాబు లిస్తారే, మీ వారికి ఈలాంటి చురక లాంటి జవాబులిస్తారని నా ఊహ.

నేను ప్రశ్నించే అవకాశం కల్గిస్తే కదా వారిని!

సిహెచ్. కె, జామి

సొంత అన్నయ్య కానంతమాత్రాన అన్నయ్యగా భావించి అభిమానం చూపడం తప్పా?

ఎంతేనా అన్నయ్యలాంటివాడు అవుతాడే గాని అన్నయ్య కాదు కదా, అందుచేత నువ్వు ఎలా భావించినా లోకం ఏదైనా అంటే, ఊరుకోకూడదు. అంతే !

సి. ఎల్, కడప

మా అమ్మ నన్ను ఎప్పుడూ 'దీని పెండ్లి అయితే మాకు భారం తగ్గుతుంది' అంటూ ఉంటారు.

నిజమే వయస్సు వచ్చాక ఆడపిల్ల తల్లితండ్రు లకు భారమే. భారం అంటే వదుల్చుకోవలసిన బెడద అనుకోకు చిట్టి తల్లీ. సరియైన వయస్సులో సంబం ధాలు చూసి పెళ్ళిచేద్దాం ఆడపిల్లకి అనుకునే తల్లి తండ్రులు కూడా అరుదైపోతున్న ఈ రోజుల్లో మీ అమ్మగారు అలా అనుకోవడం నువ్వు ఆనం దించతగిన సంగతి. సంబంధం కుదిరేదాకా అంటూ చదువుతో దింపుతారు. డిగ్రీ వచ్చాక కొన్నాళ్ళు ఉద్యోగం చెయ్యనీ అంటారు. తీరా జీతండాళ్ళ ఉపయోగం కనబడి, సంబంధాలు వెతకడమేమిటి? అంటూ గుప్‌చిప్‌గా ఊరుకుంటారు. ఇలాగే మధ్య వయస్కులై పోయిన కన్నెపిల్లలసంఖ్య విపరీ తంగా పెరిగిపోయింది గత దశాబ్దంలో. అమ్మాయి తనకు తానుగా ఉద్యోగం చేస్తూండడం వేరు. ఎలాగా ఉద్యోగం చేస్తోంది కదా అని అసలు పెళ్ళి ప్రసక్తే తేకపోవడం స్వార్థమే పెద్దలకి. అంతకంటే స్వార్థం ఆమె చెల్లెళ్ళూ తమ్ముళ్ళూ అంతా చూస్తూండగా గృహస్తులయిపోయి సుఖంగా ఉండడం!

కె. సి. ఆర్. కె, నెల్లూరు

నేను ఆత్మీయులు అనుకొన్న స్నేహి తులు నన్ను ఆత్మీయునిగా చూడరు. వారి అవసరాలకి నన్ను వాడుకొని విడిపోదామంటే అలా చేయనివ్వరు. ఏమి చేయాలి ?

మీరు ఆత్మీయులని అపర్థాలని ఏంచు కొన్నారు. అది మీ తప్పు.

బి. వి. ఆర్. ఆర్, విశాఖపట్నం

సిగ్గూ ఎగ్గూ లేకుండా మగవాళ్లతో విచ్చలవిడిగా మాట్లాడే ఆడదాన్ని ఏమనాలి? డొంకతిరుగుడుగా కాకుండా మాటిగా సమాధానం చెప్పండి రామలక్ష్మిగారు.

మగవాళ్లంత నికృష్టులా — వారితో మాట్లాడి నంత మాత్రాన సిగ్గూ ఎగ్గూ లేదంటున్నారు?

డి. జి. వి. ఆర్, ఆముదాలవలస

మనదేశంలో ఈమధ్య సమ్మెలు ఎక్కువ అవుతున్నాయి. కారణం ఏమిటండి?

అసంతృప్తి.

జి. వి. ఆర్, శ్రీకాకుళం

పెన్షారు సభ్యులపై మీ అభిప్రాయం? వారికి దాహం ఎక్కువైందిట ఈ మధ్య!

వి. జి. కె, చిత్తూరు

మీరు సువ్రతుడు సినిమా చూశారా? అలాంటి సినిమాలవల్ల వేద్యులకే సితి ఏముంటుంది ?

నేను సినిమా చూడలేదు కాని విని విని తెలుసో కున్నది ఒక్కటే—ఆడది మగవాడితో హద్దు మీరి ప్రవర్తిస్తే బాధలేదు గాని కడుపు తెచ్చు కుంటే కష్టాలు తప్పవని.

పి. బి. ఆర్, తాతానగరు

రామలక్ష్మిగారూ సినిమా పరిశ్రమలో నటీనటులు కళకోసమా డబ్బుకోసమా?

దేని కోసం ఎక్కువ చేస్తారని కదా మీ ప్రశ్న! డబ్బు కోసమే... ఆ ధనార్జనా కార్యక్రమంలో కొంచెమో గొప్పో ఆత్మసంతృప్తి కల్గేలా చేస్తా రాలు.

పెద్దకథ



[గతసంచిక తరువాయి]

ఇంటికి వచ్చేటప్పటికి తలుపులు దగ్గరకు వేసివున్నాయి.

రామ్మూర్తి దగ్గరనుంచి సరాసరి కొండమీద దేవాలయానికి వెళ్ళాను.

నాలుగయి దేళ్ళయిందేమో వెళ్ళి—

క్రిందకుదిగి ఇంటికి వచ్చేటప్పటికి తొమ్మిదిన్న రయింది.

రామ్మూర్తి కళ్యాణివ్రాసిన ఉత్తరాలు చింపివేయటం అన్నివిధాలా మంచిదేగాని, అతడు చెప్పిన తీరు నాకు చాలా అసహ్యమేసింది. కల్యాణినిగూడా అది బాధిస్తుందనే అనిపిస్తున్నది నాకు.

తలుపు తట్టాను.

కల్యాణి విధవప్పగారు తలుపుతీసింది.

'కళ్యాణి ఆఫీసుకు వెళ్ళిపోయిందా?'

'లేదు ... ఇవ్వాళ వెళ్ళనంది!'

—నా మాటకు గౌరవంఇచ్చి ఆఫీసు మానివేసినందుకు నా హృదయం ఆనందంతో ఉప్పొంగి పోయింది.

'మిమ్మల్ని ఎక్కడికీ వెళ్ళవద్దన్నది!'

'నేను ఎక్కడికీ వెళ్ళటం లేదు!'

'ఓ గంటలో డాక్టరుగారికారు పంపిస్తానన్నది ... అక్కడకు రమ్మన మన్నది మిమ్మల్ని!'

'డాక్టరుగారు ఎవరు?' వింతగా అడిగాను.

'తెలిసినవారు ... ఆయన పుట్టినరోజుట ఇవాళ...ఆయనా, డాక్టరుగారి భార్యావచ్చి కల్యాణిని తీసుకువెళ్ళారు ఓ అరగంట క్రితం!...'

నేను నీరసపడి పోయాను.

—అంటే నామాటమీద కాదన్నమాట కల్యాణి ఉండిపోయింది!

'నేను దేనికి అక్కడికి?' అన్నాను కాస్త అయిష్టంగా! 'మాష్టారు ఎక్కడకు వెళ్ళారు?'

'అలా బజారుకు వెళ్ళారు... అటునుంచి మా పినమామగారింటికి వెళ్ళి వాళ్ళమ్మాయిని చూచివచ్చేటప్పటికి ఆలశ్యమే కావచ్చు!'

ఇక నాకు అక్కడ కూర్చో బుద్ధి కాలేదు. అందుకే లేస్తూ, 'నేనలా వెళ్ళివస్తాను!' అన్నాను.

రెండడుగులు వేశాను గూడా.

'కల్యాణి మరీ మరీ చెప్పింది... అనారి డాక్టరుగారే మళ్ళా వస్తానన్నారు ... మీరు వెళ్ళకపోతే వాళ్ళేమైనా అనుకుంటారేమో!' అన్నది గుణుస్తున్నట్లుగా ఆవిడ.

నేను ఎటూ తేల్చుకోలేక పోయాను.

'ఇప్పుడే పేపరు కొనుక్కువస్తాను!' అంటూ మరో రెండడుగులు వేశాను.

'మీ కోసరమే పేపరుతెప్పించి తనగదిలో పెట్టింది కల్యాణి! మీరక్కడ కూర్చుని చదువుకుంటుండండి!' అంటూ ఆవిడ లోపలకు వెళ్ళిపోయింది.

బలహీనంగా, కల్యాణి గదిలోకి వెళ్ళి

...లు వేశాను.

కల్యాణికి ఒకవిధంగా ప్రత్యేకమైన గది అది!

అది స్వంత ఇల్లవ్వటం, దానికి తోడు ఎవ్వరికీ అద్దెకు ఇవ్వకపోవటంతో, కల్యాణి తనకోసరంగాను ప్రత్యేకంగా ఓ గదిని ఉంచుకో గలిగింది.

అలమర్లో పుస్తకాలుఉంటే చూద్దామని వెళ్ళాను.

శరత్ సాహిత్యం ఎక్కువగా కనబడింది. మపాసాకథలు, గుడ్ఎర్త్, వార్ అండ్ పీసూ వున్నయి.

పక్కగా మంచంమీద నలగని తెల్లటి దుప్పటి నాకోసరమే వేసినట్లుగా, నన్ను ఆహ్వానిస్తున్నట్లుగా వున్నది.

టేబుల్ మీద పేపరు తీసుకుంటుంటే నాదృష్టి, దానిమీద కల్యాణిరాసిన మాటల మీద పడింది.

'సత్యం! డాక్టరుగారింటికి తప్పకుండా రా...లేకపోతే నామీద ఒట్టే!... కల్యాణి'

మౌనంగా నవ్వుకున్నాను.

మంచంమీద పడుకొని పేపరు మడత తెరుస్తుంటే నా మనస్సు 'వెళ్దామా? వద్దా'? అనే ద్వైదీభావంతో కొట్టుమిట్టాడ సాగింది.

వెళ్ళితే వచ్చేనష్టం?

వెళ్ళకపోతే కలిగేలాభం ?

నాకు దేనికీ సరియైన సమాధానం దొరకటంలేదు. పిచ్చిపిచ్చి ఆలోచనలు మనస్సును పేపరుమీద లగ్నం చేయనీయలేక పోతున్నాయి...లేకపోగా కళ్లు మూతలుపడ సాగినయి.

కాని, నాకు ఒక్కటే బాధగా వున్నది.

—కల్యాణి నా కోరికను మన్నించనందుకు. అంతేగాదు, ఎవరో డాక్టరు పుట్టిన రోజు అని చెబితే ఆఫీసు మానుకొని వున్నదంటే నాకు చాలా బాధగావున్నది. నన్ను కల్యాణి చిన్నచూపు చూస్తున్నదనే భావన కించపరుస్తోంది.

కల్యాణికి నన్నుమించిన ఆత్మీయులా డాక్టరూ, ఆయన భార్యా ?

మనస్సంతా వికలమయింది.

కల్యాణి చుట్టూ నేను కట్టుకుంటున్న అందమైన భవంతులు నన్ను నిరాశపరుస్తూ కూలిపోతయ్యేమోననే భయం నన్ను కలవర పరుస్తోంది.

# వెచ్చని నీడ

'మీకోసరం కారువచ్చింది!' కల్యాణి విధవప్పగారు తలుపవతల నిలబడి అన్నమాటలకు ఉలిక్కిపడ్డాను.

లేచి బయటకువస్తూ, చివరి ప్రయత్నంలా, 'వెళ్ళక తప్పదంటారా?' అన్నాను.

'వెళ్ళకపోతే కల్యాణిగాని డాక్టరుగారుగాని మళ్ళా వస్తారేమో!' అన్నది.

నేను వెళ్ళి కార్లో కూర్చున్నాను.

దేవాలయం పక్కవీధిలో వాళ్ళింటి దగ్గర కారు దిగుతుండగానే గేటుతీసుకొని కల్యాణి ముందు బయటకు వచ్చింది.

'థాంక్యూ, సత్యం!' అన్నది.

నేనేం మాట్లాడలేదు.

'కోపమొచ్చింది గదూ?'

'నీకేమైనా నష్టమా, దానివలన!'

'నన్ను క్షమించలేవా?' కంఠం జాలిగా వున్నది. కల్యాణి కంట్లో నీరు గూడా తిరుగుతున్నదేమోననిపించగా చాలా సిగ్గుపడ్డాను—!

'పద పద ... అయిపోయిందేదో అయిపోయింది!...' అనునయిస్తూ, కల్యాణిని అనుసరించాను.

డాక్టరుగారు హాల్లో కూర్చొని కనబడ్డారు.

'ఇదిగో, ఈయనగారే, మా సత్యం!' అన్నది నన్ను పరిచయం చేస్తూ.

నేను రెండు చేతులూ జోడించి నమస్కరించాను.

'నేను స్వయంగా మిమ్మల్ని ఆహ్వానించలేక పోయాను...నన్ను మన్నించండి... నా మాటను మన్నించి మీరు శ్రమ తీసుకొని వచ్చినందుకు చాలా కృతజ్ఞుణ్ణి!' అన్నారు సాదరంగా ఆహ్వానిస్తూ.

ఆయన వయస్సు యాభై పైబడే వుంటుంది. జుట్టంతా తెల్లబడిపోయింది. ఎర్రటి మనిషి...పొడుగ్గా లావుగా హుందాగా వున్నారు. చేతిలో దంతపు పిడి వున్న కర్ర...

ఆయన ఏ డాక్టరో నాకు అర్థం కాలేదు...

'కల్యాణీ! రాజేశ్వరిని పిలువు ... అబ్బాయిని పరిచయం చేద్దాం!' అని అంటూనే వున్నారు—ఆవిడ రానే వచ్చింది.

ఈయనంత హుందాగానూ వున్నది, లావు!

నమస్కారం, ప్రతి నమస్కారాల తర్వాత ఆమె లోపలికి వెళ్లబోతూ, 'టిఫిన్ పంపిస్తాను!' అనంది.

డాక్టరుగారు తీరిగా తల ఊపారు.

'కల్యాణీ! నీవు గూడా కూర్చో!'

'నేను తీసుకు వస్తాను!'

'నేను ఇప్పుడే తిని వచ్చాను!...'అన్నాను నేను—బిడియపడుతూ.

'ఎక్కడ?'

అబద్ధమాడక తప్పలేదు! 'హోటల్లో!'

'ఎక్కడ హోటల్లో?'

'మా యింటికీ —రామ్మూర్తి ఇంటికీ నడుమ ఎక్కడా హోటళ్లు లేవు!' అన్నది వత్తి పలుకుతూ.

రామ్మూర్తి విషయం, కల్యాణి అంత నిర్భయంగా మాట్లాడుతున్న తీరు — అందునా పరాయి వ్యక్తుల దగ్గర— నాకు కించిత్ ఆశ్చర్యాన్నే కలిగించింది.

అంతేగాదు — రామ్మూర్తి విషయం వాళ్ళకు తెలిసినట్లే వున్నది!

అప్పటి నుండి మధ్యాహ్నం భోజనాలయి నేను మొండిపట్టు పట్టి ఆ గృహం నుండి బయటపడేటంతవరకూ కల్యాణిది నామీద పైచేయిగానే వున్నది.

ఆమె చెప్పినదల్లా చేయకా తప్పలేదు. కడుపు నిండి పోయినా పెరుగన్నంలో చక్రకేళీలు వేసుకోకా తప్పలేదు!

ఇంటిముందు కారు దిగుతుంటే, మాష్టారు హడావుడిగా ఎదురు వచ్చారు.

'అమ్మాయి కల్యాణి రాలేదా?' అడిగారు ఆత్రంగా.

'ఏమైంది?' అన్నాను.

'మా వాళ్ళమ్మాయికి బాగోలేదుట... మేం వెళ్ళి వస్తాం గాని, నీవు ఇంట్లో వుండు!' అంటూ ఆయన, కల్యాణి విధవ అప్పగారు కార్లో కూర్చొని డాక్టరుగారింటికి వెళ్లారు.

ఆ గృహంలో నేను ఒంటరిగా మిగిలి పోయాను.

కాస్త భోజనం ఎక్కువయిందేమో! కల్యాణి గదిలో తెల్లదుప్పటి పరిచిన మంచాన్ని చూస్తూ నిద్రను ఆపుకోలేక పోయాను.

సాయంత్రం నాలుగు గంటలప్పుడు తలుపు దడదడా మోత అవుతుంటే లేచి

# బిన్‌టెక్స్ పేరుకి బిన్నీవారి గౌరవ ప్రతిష్ఠల పురస్కరణవుంది

బిన్‌టెక్స్ శ్రేణిలో మంచి మంచి రంగుల చీరలు, బాటిక్ ప్రింటులు, ఇతర బట్టలు మరియు చేతిరుమాళ్లు-దక్షిణ హిందూదేశములో సుప్రసిద్ధమైన నేత పనివాండ్ర నవర [illegible] వారి పై శిష్ట్యమును పరీక్షలో అతి జాగ్రత్తగా ఎన్నుకొనబడినవి.

స్త్రీలకు, ఆడపిల్లలకు బిన్‌టెక్స్ శ్రేణిలో, ఇండియన్ క్రేప్, ఇటాలియన్ క్రేప్, మరియు ప్రిన్సెస్ చీరలు, బృందావన్ అంచుల చీరలు, హాలీవుడ్ ఎంబ్రాయిడరీ అంచులతో చేతి రుమాళ్లు, ఇతర బట్టలు మరియు బాటిక్‌లు.

**బిన్‌టెక్స్**



బిన్నీ లిమిటెడ్‌వారి పురస్కరణ అమ్మకము.

తెల్లి తలుపు తీశాను.

కల్యాణి వచ్చింది!

'ఎలా ఉన్నది ఆ అమ్మాయికి?'

'ఫరవాలేదు...ఆ హడావుడి తగ్గింది ... నీ వక్కడికే బోరుకొడుతున్నదేమోనని వచ్చేశాను!'

నా వెనగ్గా, తలుపువేసి లోపలకు వచ్చేసింది.

'ఇప్పటిదాకా ఏం చేస్తున్నావు నిద్రపోతున్నావా?'

'లేదు ... నిన్ను గురించి ఆలోచిస్తూ, సర్వం మర్చిపోతున్నాను!'

'నన్ను గురించి ఆలోచించేందుకు ఏం వున్నది' అన్నది కుర్చీలో కూర్చుంటూ.

నేను ఆమె మంచంమీదే కూర్చున్నాను.

'కల్యాణి!' ఆమెనే తదేకంగా చూస్తూ అన్నాను.

కల్యాణి. ఎంతదైంది?

చిన్నప్పుడు — సన్నగా, పీలగా విలుకతో కల్లాంటి రెండు జడలతో, మాట్లాడించినా నోట్లో నాలికలేని దానిలా కూర్చుండే కల్యాణి ఈమేనా?

ఈనాడు ఎలా మారిపోయింది?

'కల్యాణి!' తన్మయంగా ఆమె మొఖంలోకి చూస్తూ అన్నాను.

'చెప్పు, సత్యం!'

'నేనంటే నీకెందుకు అయిష్టం?'

ఆమె క్షణంలో గంభీరురాలైంది: 'నీకు మించిన ఆత్మీయులు నా కెవ్వరున్నారని, సత్యం!'

'మరి —?'

'మన ఆత్మీయత జీవితాంతం ఇలాగే నిలిచి వుండాలని నా కోరిక!'

'మనిద్దరం ఒకటైననాడు దానిని శాశ్వతం చేసుకోగలుగుతాం గదా'

'అది నీ భ్రమ!'

'ఎందుకని?'

'జీవితం నాకు చాలా పాఠాలు నేర్పింది... నీకు తెలుసో, తెలియదో!' అన్నది.

'నాకు కొన్ని అర్థమయినయి ... వాటిని తిరగతోడి నీకు మనస్తాపాన్ని కలిగించేటంత బలహీనుణ్ని కాదు నేను... అలాంటి వాడినయితే, నేను ఇక్కడ నీ ఎదుట ఇప్పుడు కూర్చొని వుండేవాడినేగాదు!'

కల్యాణి తల ఎగరవేసింది: 'మరి ఏం చేసేవాడివేం?' అన్నది.

జాలిగా కల్యాణి మొఖంలోకి చూశాను.

లేచి నిలబడి ఆమెకు దగ్గరగా అడుగులు వేయసాగాను.

'కల్యాణి! నీతోడు లేందే నేను బ్రతకలేనేమోననిపిస్తోంది ... మన జీవితాలను నందనోద్యానవనంలో విహరింపజేసే శక్తి నీలోనే వున్నది!'

కల్యాణి లేచి నిలబడింది.

'ఆవేశపడబోకు సత్యం! ముందొకరు లేందే మనం బ్రతకలేం అనుకోవటం మన బలహీనత!'

'అంగీకరిస్తున్నాను! అందుకే అర్థిస్తున్నాను!' అన్నాను.

కల్యాణి నవ్వింది. పేలవంగా నవ్వింది.

'బలహీనత అంటే నాకు అసహ్యం తెలుసా?' మొఖాన్ని చటుక్కున పక్కకు తిప్పుతున్నది.

'కల్యాణి!' ఆమె రెండు భుజాలూ గట్టిగా పట్టుకొని ముందుకు లాక్కున్నాను. 'ఏమన్నావ్ కల్యాణి!'

ఆమె ఏడుస్తున్నది.

'కల్యాణి ఏడుస్తున్నావా?'

'ఏడవక నవ్వమంటావా?'

'ఎందుకు ఏడవాలి నీవు?'

నా వైపుకు తిరిగింది.

'నీవు నన్ను మర్చిపోగలిగితే క్షణంక్షణం ఏడ్వనక్కర్లేని ఈ బాధ నాకు తప్పుతుంది!' అన్నది. 'తెలుసునా?'

'కల్యాణి!'

'అవును, సత్యం!'

ఇంత దృఢంగావున్నదా కంఠం!

జావలా జారిపోయాను. ఆమెను వదిలి వేశాను.

'కల్యాణి ఇది నీ తిరుగులేని నిర్ణయమా?'

'నేను బలహీనురాల్నికాదు, సత్యం!'

మరుక్షణంలో నేను అక్కడ లేను!

* * *

నేను కల్యాణిని అంతటితో వదలదలుచుకోలేదు.

—పాతజ్ఞాపకాలను గుర్తుకు చేస్తూ, తనని, తన మనస్సును భావిలో గాయపరుస్తానేమోనని కల్యాణి భావన అయి వుండవచ్చు!

ఆరాత్రి సూర్యంకు చెప్పినట్టుగా వాడిగదికి రాత్రి పదిన్నరగంటలకు వెళ్లాను.

వాడు నాకోసరమే ఎదురుచూస్తూ కూర్చొని వున్నాడు.

'నీవు విజయం గనుక సాధించివుంటే నా హృదయపూర్వక అభినందనలను స్వీకరించుము, నాయినా!' అన్నాడు నవ్వుతూ వాడు.

'నేను ఓడిపోయాను!'

'అయితే ఇంగ్లీషులో చెబుతాను... హార్టీ కంగ్రాచులేషన్స్!' అన్నాడు లేచి నిలబడి.

'ఎందుకని?' చురకత్తిలా చూశాను.

'ఆమె తన రంగులవలను నీమీద వేయకపోవడం— అందునా నీవు కావాలని ఆవలలో ఇరుక్కోవాలని వెళ్లినా!'

'నీవేం మాట్లాడుతున్నావో నీకు అర్థమవుతున్నదా?'

'నీమీద ఒట్టు!... నేను ఇప్పుడు మాత్రం బుడ్డి కొట్టి లేను!' అన్నాడు పెద్దగా నవ్వి వాడు.

'సూర్యం!'

'సత్యం! నీ ఆవేశాన్ని అవతలపెట్టి ఈ సూర్యం చెప్పే నాలుగుమాటలూ నీవు విన్నావో...నీకు ముక్తి లభిస్తుందనేది ఖాయం!... అవిడగారు రామ్మూర్తి అనే ఓ బంగారు పిచ్చుకను తనవలలో బంధించిననాడే నాకు అంతా తెలిసిపోయింది!'

'నీకేం తెలిసింది?' నేను ఆవేశంగా మీదిమీదికి వెళ్లసాగాను.

—ఏమన్నా ఊరుకోగలను గాని, కల్యాణిని అంటే సహించేశక్తి నాలోలేదు!

'కల్యాణి ఈ మధ్యకాలంలో ఒకనాడు తనపాప కార్యాలకు ఫలితంగా తల్లి అయ్యే భ్రమ్మ అయిందని నీకు తెలుసా?' కళ్ళు చికిలించి ఏహ్యంగా మొఖంపెట్టి అన్నాడు.

'సూర్యం! ఏమన్నావ్?'

'ఆ పుణ్యాత్ముడే నోట్లను నయాపైసల్లా ఖర్చుపెట్టి ఓ డాక్టరు ద్వారా అంతా మాయచేశాడు—తెలుసుకో సత్యం, తెల్లనివన్నీ మంచిముత్యాలు కావు!'

'నిరూపించగలవా?'

'సూర్యాన్ని నమ్మలేవా?'

'ఎవరా డాక్టరు?'

'దేవాలయం పక్కవీధిలో...'

'దేవాలయం పక్కవీధిలో...?' వివి[illegible]త్రంగా, భయంగా చూస్తూ ముందుకు అడుగులు వేయసాగాను.

యర్రం చంద్రశేఖరం

### జరిగిన కథ

లక్ష్మయ్యగారొక మోతుబరి రైతు. శాంత ఆయనకి ఏకైక కుమార్తె. తల్లిదండ్రులు లేని మేనల్లుడు రామాన్ని చిన్నప్పటినుండి తనే పెంచి పెద్ద చేస్తాడు. రామం చదువు హెచ్.ఎస్.సి.తో ఆపేసి వ్యవసాయపు పనులు చూసుకుంటాడు. శాంతను కాలేజి చదువుకు పంపిస్తారు. కాలేజిలో ఆమెకి శారద అనే బీదవిద్యార్థిని స్నేహితురాలవుతుంది. శారద విషాదగాథ శాంతను కదిలించి వేస్తుంది. శారదకి ప్రభాకరం పరిచయమవుతాడు. రామం మీద విసుగు చెందిన శాంత సుందరంమీద మోజు పడింది. ఇద్దరూ పెళ్ళిచేసుకోవాలనుకున్నారు. ఈ విషయం విని లక్ష్మయ్యగారు బాధపడ్డారు. రామం ఆతనికి సర్ది చెప్పవలసి వచ్చింది. ప్రభాకరం వచ్చాడు. అతను పూర్తిగా మారిపోయినందుకు శారద సంతోషించింది. శారద సుందర రామయ్యగారి కుమార్తె అనే రహస్యం తెలుస్తుంది. శారదకూ ప్రభాకరానికీ వివాహం చేయాలనుకుంటారు. సుందరం ఆట కట్టించటానికి ప్రభాకరం, శారద నీరజలు ప్లాను వేసుకుని అక్కడికి వస్తారు. నీరజ నుంచి వచ్చిన పుత్తరం సుందరాన్ని క్రుంగదీసింది.

## 21

ప్రభాకరం, శారద శాంత, రామం, సుందరం, తాయారు, నీరజ వీరంతా లక్ష్మయ్యగారి తోటలో పచ్చికపై కూర్చున్నారు.

'నేను నా స్నేహితునికి ద్రోహం తలపెట్టాను.' అందుకు ప్రతిఫలం అనుభవించాను. నీరజ, శాంత యిద్దరూ నాకు బుద్ధి చెప్పారు. నాతప్పు నేను తెలుసుకున్నాను. నన్ను క్షమించ వలసిందిగా అందరినీ వేడుకుంటున్నాను. రామానికి నేను ద్రోహం చేస్తున్నా అతను మాత్రం నన్ను ద్వేషభావంతో చూడలేదు. అతని గొప్ప వ్యక్తిత్వానికి ఆనందపడుతూ నన్ను క్షమించ వలసిందిగా మీ అందరినీ వేడుకుంటున్నాను.' అందరినీ చూస్తూ అని రామంవైపు తిరిగి 'రామం! నీకు నేను క్షమించరాని అన్యాయం తలపెట్టాను. శాంత నీ భార్య ఔతుందని ఆమె పుట్టినప్పటి నుండి అందరూ అనుకునే విషయం తెలిసుండి మొండిగా ఆమెను వివాహం చేసుకోవాలనే తీవ్రకాంక్షతో ఆమె మనసును నా కుయుక్తులతో విరిచేశాను. తాయారు సాయంతో నీపై లేనిపోని అపోహలు శాంతకు కలిగేలా సంఘటనలను సృష్టింపజేసి నేను నా కార్యాన్ని సఫలమొనర్చుకున్నానని తలచాను. ఆ భగవంతుడు న్యాయానికి మంచితనానికి జయం ప్రసాదించాడు. నా ప్రయత్నాలు విఫలమయ్యాయి.

'రామం! నీవు నాకు అందిచ్చిన పాలగ్లాసును ఖాళీచేసి దానికి ప్రతిగా అందులో విషాన్ని నింపి తిరిగి నీకందించాలని ప్రయత్నించాను. నన్ను క్షమించవూ?' సుందరం కళ్ళు కన్నీటితో నిండిపోయాయి. పశ్చాత్తాపం అతని ముఖంలో స్పష్టంగా కనిపిస్తూ అక్కడ ఉన్న వారందరి హృదయాలను కదిలించి వేసింది.

'ఒరేయ్ సుందరం! మనం మానవమాత్రులం. పొరపాట్లు జరగడం సహజమే! కాని వాటిని గుర్తించి మానవత్వాన్ని తెలుసుకొని తప్పు దిద్దుకొనేవాడు దేవుడితో సమానమైనవాడు. నీవు నీ తప్పు తెలుసుకొని పశ్చాత్తాప పడుతున్నావు. నీ పశ్చాత్తాపమే నీ తప్పులను క్షాళితం చేసింది. ఇందులో నిన్ను ప్రత్యేకంగా క్షమించే అవసరమే లేదు.' అన్నాడు రామం తన నిర్మల దృష్టిని సుందరంపై ప్రసరింపజేస్తూ.

'రామం నీవు సహృదయుడవు. శత్రువుకైనా హాని తలపెట్టనటువంటి స్వభావం నీది. అంటువంటి నిన్ను, ఈ గ్రామానికంతటికీ భీష్మునిలాంటి లక్ష్మయ్యగారిని ఎంతో చిత్తక్షోభకు గురిచేశాను. ఈ విషయం గ్రామంలో నలుగురికి తెలియక ముందే నేను యిక్కడినుండి వెళ్ళిపోతాను. తెలిసిన తర్వాత యిక్కడ తల ఎత్తుకొని తిరగలేను.' నేలచూపులు చూస్తూ నెమ్మదిగా అన్నాడు.

'ఏమిట్రా నీ పిచ్చి! ఆ మాటకొస్తే ప్రపంచంలో తప్పులు చేయని వారెవ్వరు? అందరూ చేస్తారు. కాని నీలా తమ తప్పులు తెలుసుకొని పశ్చాత్తాప పడేవారు చాలా కొద్దిమంది ఉంటారు. నీవు ఎక్కడికీ వెళ్ళనవసరంలేదు. వెళ్ళనివ్వను. ఇక్కడే ఉండాలి. ఈ విషయం యిక్కడఉన్న మనకు తప్ప మరెవ్వరికీ తెలియదు. అది నా బాధ్యత. నీవు నిశ్చింతగా ఉండు.' — ప్రభాకరం భుజంపై చేతులువేస్తూ అన్నాడు రామం.

'రామం నీవు మనిషివి కాదురా...! దేవుడవు' ఆనందభాష్పాలు రాలుస్తూ రామాన్ని కౌగలించుకున్నాడు సుందరం.

ఆ దృశ్యాన్ని చూసిన అందరి మనసులూ కుదుటపడ్డాయి —

'సుందరం, బావ నిన్ను క్షమించాడు. నీవు క్షమాపణ కోరావు. కాని నాకు నన్ను క్షమించమని అడగడానికే బిడియంగా ఉంది. నీ మోసంలోపడి బావను నా చేజేతులా నాకు దూరం చేసుకున్నాను. నేను ఆవేశపరురాలనని తెలుసుకున్న నీవు నా బలహీనతను ఆసరా చేసుకొని మా యిద్దరినీ విడదీయాలని తీవ్రప్రయత్నం చేశావు. దాని

పర్యవసానం ఈ విధంగా జరిగేదికాదు. సహృదయుడైన బావ నిన్ను క్షమించాడు. నేను మాత్రం నా కంఠంలో ప్రాణముండగా నిన్ను క్షమించను ...' అని వెక్కి వెక్కి ఏడుస్తూ 'నీ మాటలలో పడి దేవుడిలాంటి బావను ... అనుమానించాను ... నాన్నను, అమ్మను మానసికంగా ఎంతో బాధ పెట్టాను. నా పాపాలకు నిష్కృతి లేదు... బావను క్షమించమని అడిగే అర్హత కూడా నాకు లేదు.' శారద భుజంపై తల ఆనించి ఏడుస్తున్న శాంతనుచూసి అంతా జాలి పడ్డారు.

'ఊరుకో శాంతా...! ఏమిటిది? చిన్న పిల్లలా ఏడుస్తున్నావ్ ? తప్పుకదూ ! అన్నయ్య నిన్నూ తప్పకుండా క్షమిస్తాడు. అపూచీ నాది. ఈ విషయంలో నీవు నిశ్చింతగా ఉండు.' శాంతను వోదార్చింది శారద.

'శాంతా...! నీ బావను నీ వర్థం చేసుకున్నదింతేనా ? నీవు ఏ నేరం చేశావని నిన్ను క్షమించడం ! ఆ పరిస్థితులలో నీ స్థానంలో మరెవరన్నా నీలాగే ప్రవర్తిస్తారు. ఇందులో నీ తప్పేమీ లేదు.' చిరునవ్వుతో అన్నాడు రామం.

'తప్పంతా నాది. అన్నయ్య నాతో ఈ విషయం సంప్రతించినప్పుడు అతనికి బుద్ధి చెప్పవలసింది పోయి, అతను చెప్పినట్లే చేయడం యిన్ని అనర్థాలకు మూలకారణమైంది. రామం, శాంత, యిద్దరూ నన్ను క్షమించాలి. అంతవరకూ నాకు మనశ్శాంతి ఉండదు.' అని మార్చి మార్చి తనదృష్టిని శాంతా రామంలవైపు ప్రసరింపజేస్తూ అంది తాయారు.

'అన్నీ మరిచిపోయి. అందరమూ విప్పటిలా మసులుకుందాం. ఇక లేనిపోని సంభాషణలతో మన అతిథులను విసిగించకూడదు.' ప్రభాకరం నీరజలవైపు చూస్తూ అన్నాడు రామం.

తేలికపడిన మనసులతో అంతా అక్కడి నుండి లేచారు — నడుస్తూ మళ్ళీ కబుర్లలో పడ్డారు.

'ఒరేయ్ సుందరం! అతి తెలివికిపోయి రెంటికి చెడ్డరేవడి వయ్యావు. మరిప్పుడేలారా?' ఎగతాళిగా సుందరాన్ని చూస్తూ అన్నాడు రామం.

'నీవు ఊరుకో అన్నయ్యా! ఇప్పటికే శాంత, నీరజలు సుందరంగారిని చిత్తుగా హడలగొట్టారు. చచ్చినపామును యింకా ఏం చంపుతావు?' అని నీరజవైపు తిరిగి 'నీరజా సుందరంగారు తమతప్పు తెలుసుకున్నారు. పశ్చాత్తాప పడ్డారు. ఇప్పుడేమంటావ్?'—శారద.

'అనడానికి ఏముందక్కా? నీవెలా చెబితే అలా నడుచుకుంటాను' భారాన్నంతా తన సోదరిపై నిశ్చింతగా వేసింది నీరజ.

సుందరం ఆస్పత్రివైపు నడిచాడు. మిగతా వారంతా లక్ష్మయ్యగారి యింటివైపు దారి తీశారు.

ప్రభాకరం పుట్టినరోజు పండుగ రెండు రోజులే ఉండడంవల్ల మరురోజే అంతా హైదరాబాదు వెళ్లారు. లక్ష్మయ్యగారినీ, పార్వతమ్మగారినీ బలవంతంచేసి తీసుకు వెళ్లాడు ప్రభాకరం. సుందరం మొదట రానన్నా, ఆ తర్వాత రామంమాట తీసివేయ



లక అందరితో కలిసి వెళ్ళాడు.

*  *  *

శ్రీపతిగారి యిల్లు బంధువులతో, పుర ప్రముఖులతో కళకళ లాడుతూ ఉంది. ప్రభాకరం పుట్టిన రోజు పండుగకు ఏర్పాట్లు భారీఎత్తున చేయించారు శ్రీపతి గారు. ప్రసాద్ రవీంద్రభారతిలో శారదకు సన్మానం జరిగిన మరురోజు యింటికివెళ్ళి మళ్ళీ వచ్చారు.

పుట్టినరోజు పండుగ ముగియగానే శ్రీపతిగారు శారదను తన పెదకోడలుగా ఆహూతు లందరికీ పరిచయంచేసి తనకు కాబోతూన్న కోడలుగా ప్రకటించారు. ఈ విషయం అందరికీ సంతోషాన్ని కలిగించింది. ఆమె గొప్ప రచయిత్రి అని తెలిసినవారంతా ప్రభాకరం అదృష్టవంతుడని అనుకున్నారు. కొందరు ఆమాటే పైకి కూడా అన్నారు.

శారదకు రత్నాలనెక్లెసు, ఎంతో విలువైన చీరెలు అందరి సమక్షంలో అంద జేశారు శ్రీపతిగారు. ఆ విధంగా వారు తమకు కాబోయే కోడలిని సన్మానించారు.

అతిథులంతా 'వుడ్‌బికపుల్'ను ఆశీర్వదిస్తూ, అభినందిస్తూ విందు ముగిసిన తర్వాత వెళ్ళిపోయారు.

రెండవరోజు శారద, నీరజల వివాహా లకు ముహూర్తాలు నిర్ణయించేందుకు పురోహితునికి కబురుపంపి, అతని రాకకోసం ఎదురుచూస్తూ హాలులో కూర్చొని కబుర్లలో పడ్డారు.

'అంతా బాగానే ఉంది, కన్యాదానం ఎవరు చేస్తారోయ్ ? ఈ ఆలోచన యింత వరకూ తట్టనేలేదు.' విస్మయంతో సుందర రామయ్యగారిని చూస్తూ అన్నారు శ్రీపతి గారు.

'నిజమే సుమండీ! పెద్దచిక్కే వచ్చిందే! మీరు అనేంతవరకూ, ఆ ఆలోచన నాకు తట్టనేలేదు. ఎలాగబ్బా ... ? పెద్ద సమస్యేనే?' సందిగ్ధావస్థలో పడి అన్నారు సుందరరామయ్యగారు.

'ఎలామరి ?' ... అన్నపూర్ణమ్మ గారి ఆందోళన.

'గట్టి చిక్కే !' శ్రీపతిగారి అభి ప్రాయం.

అంతా ఆలోచనలో పడ్డారు—

కొన్ని నిముషాల తర్వాత శ్రీపతిగారు తల పంకిస్తూ 'ఒక్కటే మార్గముంది. అందుకు మన రామం సహాయం కావాలి.' ఆప్యాయంగా రామాన్నిచూస్తూ అన్నారు.

'నా సహాయమా ...! అందుకు నేను సిద్ధం.. చెప్పండి. ఏం కావాలంటే అది చేస్తాను.' చిరునవ్వు ముఖాన చిందిస్తూ అన్నాడు రామం.

'ఏమీలేదు వెంటనే శాంతను వివాహ మాడి సతీ సమేతంగా నీవే కన్యాదానం చేయాలి. శారద, నీరజలకు అన్నవరుస అయ్యే బంధువులు ఉన్నారు. కాని నాకు యిష్టం లేదు. శారదను ఆదుకొని స్వంత చెల్లెలికన్న మిన్నగా చూసుకున్నావు. అందుకు నీవే అర్హుడవు' లక్ష్మయ్యగార్ని చూస్తూ 'మీరేమంటారు ? ముందు మీ అమ్మాయి వివాహం రామంతో జరిపించిన తర్వాత శారద, నీరజల వివాహాలు జరి పించాలి.'

'అంతకన్నానా...!' రామాన్ని ప్రశ్నార్థకంగా చూశారు లక్ష్మయ్యగారు.

'నాకు చాలా సంతోషంగా ఉంది. ఇటు వంటి సదవకాశం నాకు లభిస్తుందని నేను కలలోకూడా ఊహించలేదు. నాకు చెల్లెళ్ళు లేని కొరతను శారద, నీరజలతో తీర్చు కుంటాను. కాని సుందరరామయ్యగారి కేమైనా అభ్యంతరం ఉం...'

రామంవాక్యం పూర్తి కాకుండానే 'ఏంతమాటన్నావు బాబూ ! నాకు అభ్యంతర ముంటుందా? నా కన్నతల్లికి నీవే అన్నవు, తండ్రివీకూడా! పేరుకు మాత్రమే నేను కన్నతండ్రిని. నాకు ఎంతో సంతోషంగా ఉంది...' భరించలేని సంతోషంతో అన్నారు సుందరరామయ్యగారు.

అంతలో పురోహితుడు వచ్చాడు. ముందుగా శాంతారామంల వివాహానికి ముహూర్తం నిర్ణయించారు, ఆ ముహూర్తానికి నాలుగయిదు రోజులతర్వాత శారదా నీరజలకు ముహూర్తాలు కుదిరాయి. అవకాశం ఎక్కువగా లేనందువల్ల మరురోజే అంతా రామం ఊరికి బయలుదేరివెళ్ళి, అక్కడ పెళ్ళి ప్రయత్నాలలో నిమగ్ను అయ్యారు.

*  *  *

అంతకొద్ది వ్యవధిలోనే శాంతారామంల వివాహం ఎంతో ఘనంగా జరిగింది. చాలమంది పేదలకు అన్నదానం జరిపారు లక్ష్మయ్యగారు. ఆ చుట్టుపట్టుగల గ్రామాలలో శాంతారామంల వివాహ ప్రసక్తినే చర్చించుకో సాగారు. ప్రభాకరం సుందరం యిద్దరూ పెళ్ళిపెద్దలై ఎక్కడ చూసినా వారే కనుపించారు.

సుందరం నీరజను వివాహ మాడుతున్నాడని తెలిసి రంగయ్య తాత ఎంతో సంతోషించాడు. వారి కుటుంబంలోని వారంతా సుందరం వివాహానికి తమ హర్షాన్ని తెలి యచ్చారు.

రేపు హైదరాబాదు వెడతారనగా నీరజ సుందరంలు హోస్పిటలులో సుందరం రూములో కూర్చొని కబుర్లలో పడ్డారు.

'నీరూ! నన్ను క్షమిం...'

సుందరాన్ని వారిస్తూ అతను తన మాటలు పూర్తిచేయకుండానే 'మీరలా మాట్లాడకండి. జరిగినదంతా ఒక పీడ కలగా మరిచిపోండి' ప్రేమతో నిండిన చూపులతో సుందరాన్ని కలవర పెట్టింది నీరజ.

'నీవెంత మంచిదానవు నీరూ! నాయత్నం వన్నింటినీ క్షమించావు'

'నేనే కాదు. స్త్రీల హృదయాలన్నీ అటు వంటివే డాక్టర్! ఎంతో సున్నితంగా గాజు వలె ఉంటాయి. పురుషులు తమ కఠిన హృదయాలతో వాటిని చిట్లగొడతారు. ఆ చిట్లిన హృదయాలతోటే పురుషుం శ్రేయస్సు కోరుతూ జీవితాంతం బాధపడ తారు. మా అక్కయ్యను, ఆమె తల్లిని అందుకు తార్కాణంగా తీసుకోవచ్చు. బావ ప్రథమంలో అంత కఠినంగా ప్రవర్తించినా అక్కయ్య యిసుమంతైనా బాధపడకుండా తుదకు అతనిలో వచ్చిన మార్పుకు కారకురాలై చివరకు వివాహం చేసుకోబోతూ ఉంది. ఆనాడు మాపెద్దమ్మ మా నాన్నగారి పేరును ఎక్కడా బయట పెట్టలేదు.' సగర్వంగా స్త్రీజాతిని సమర్థిస్తూ, సుందరం కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అంది నీరజ.

'అవును నీరూ! నీవన్నది నిజమే! అందుకే అంటారు స్త్రీకి భూదేవికి ఉన్నంత ఓర్పు ఉంటుందని' అని మళ్ళీ 'ఇంతకూ నీవు నన్ను క్షమించినట్లేనా?' అడిగాడు సుందరం.

'పొరపాట్లు అందరూ చేస్తారు. మీరు

# మీ బాలుడు బలహీనంగా ఉన్నాడా?
# అతని ఆహారంలో పోషక శక్తి సరిగా లేదా?
# అతనికి సరిగా ఆకలి వేయదా?
# అయితే అతనికి ఫెరడాల్ ఇవ్వండి...



అతను ఎంత బలంగా, దిట్టంగా ఎదుగుతాడో పరిశీలించండి. పాలు, ఆహారధాన్యాలు, కూరగాయలు, పళ్లు మరియు గ్రుడ్లు వంటి స్వాభావిక ఆహారాలవల్ల లభించే మేలును, పోషణను మీ బిడ్డకు ఒక ఫెరడాల్ మాత్రమే సమకూర్చగలదు. ఎందువల్లననంటే, ఇనుము, విటమిన్లు, మరియు ఖనిజ పదార్థాలు ఫెరడాల్‌లో ఖచ్చితంగా సరియైన పాళ్లలో ఉన్నాయి. ఎముకలు దంతాలు దృఢంగా తయారవాలన్నా, కండరాలు బలంగా పెరగాలన్నా, పుష్టిగల రక్తం పట్టాలన్నా, శరీరంలో రోగనిరోధక శక్తి వృద్ధి పొందాలన్నా, కంటి చూపు కళ్లూ బాగా ఉండాలన్నా, మీ బిడ్డ చురుకుగా ఆరోగ్యంగా ఎదగాలన్నా ఫెరడాల్‌లో ఉన్న ఈ ఇనుము విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలు మిక్కిలి అవసరం. ప్రతిరోజూ ప్రొద్దున పూట రాత్రి పూట మీ బాలునికి ఫెరడాల్ ఇవ్వండి. పాలతో కలిపి అయినా సరే, దేనితోను కలవకుండా యథాతథంగా నైనా సరే తీసుకోవచ్చును. కుటుంబంలో అందరికీ ఫెరడాల్ మంచిదని గుర్తుంచుకోండి.




## ఫెరడాల్®

కమ్మని రుచి కలది

కుటుంబమంతకూ మంచిది

పార్క్-డేవిస్ ఉత్పత్తి

ఆ చేసిన పొరపాటును ఒప్పుకున్నారు. అందరి చేతా క్షమించబడ్డారు.' అంది నీరజ చిరునవ్వుతో.

నీరజను దగ్గరకు జరుపుకుంటూ ఆమె [illegible] వేడికి తన్మయుడయ్యాడు సుందరం—

అదే సమయంలో ప్రభాకరం శారదలు ఏకాంతంగా లక్ష్మయ్యగారి తోటలో కూర్చొని కబుర్లలో పడ్డారు.

'శారూ! నీ తెలివితేటలతో పరిస్థితిని ఎంతో మెరుగుపరచావు. లేకపోతే అటు నీ జీవితమో, ఇటు శాంత జీవితమో నాశనమై ఉండేది. నీ తెలివితేటలకు [illegible]సారి అభినందిస్తున్నాను.'

'నా తెలివి తేటలకు మీరు సంబర [illegible]' చిరునవ్వుతో అని మళ్లీ 'మొదటిసారి ఎప్పుడు' అని ప్రశ్నించింది.

'నీవు [illegible] తెలిసినప్పుడు'

'అలాగ' — ప్రభాకరాన్ని చిలిపిగా చూస్తూ శారద.

'అవును! భార్యగానే కాకుండా మంత్రిగా కూడా పనికి వస్తావు. ఇప్పుడే నిన్ను ఆ పదవికి నియమిస్తున్నాను.'

'జీతమెంతిస్తారో?'

అడిగినంత ఇప్పుడుమాత్రం ఇవ్వలేను...'

# మల్లెలు...

అంటూ శారదను అకస్మాత్తుగా తన బాహుబంధంలో బిగించి గులాబీలతో పోటీ పడుతూన్న ఆమె చెక్కిలిపై తన పెదిమలతో సున్నితంగా ముద్రవేశాడు.

'అబ్బ! ఒదలండి ఎవరైనా చూస్తారు! రోజురోజుకీ మీరు మరీ కొంటెవారౌతున్నారు,' ఆ కౌగిలిలోని హాయిని అనుభవిస్తూ, కౌగిలిలో మరీ ఒదిగిపోతూ పైకి మాత్రం అలా అంది శారద. వీరిద్దరి ప్రణయాన్ని చూసిన చిలుకల జంటొకటి కొన్నిక్షణాలు మాట్లాడుకొని ఆ తర్వాత ఒకదాని చేరువకు మరొకటి చేరుకుంది.

* * *

శారద నీరజల వివాహాలు హైదరాబాదులో సుందర రామయ్యగారి యింట్లో ఎంతో ఆడంబరంగా జరిగాయి. శాంతా రామంలు వారిద్దరికీ కాళ్ళు కడిగి ఆ పిన్న వయసులోనే కన్యాదాన ఫలితాన్ని దక్కించుకున్నారు.

పెళ్ళి పందిరిలో పసుపుగుడ్డలతో వింత కాంతితో మెరిసిపోతూన్న ఆనూతన వధూ, వరూద్వయాన్ని చూసిన ప్రతివారి హృదయమూ సంతోషంతో పొంగి పులకించింది.




శ్రీపతిగారు, — సుందరరామయ్యగారు ఆ నూతన వధూవరులను తనివితీరా దీవించి ఎవ్వరూ చూడకుండా తమ ఆనంద బాష్పాలను తుడుచుకున్నారు.

ప్రభాకరం తన వివాహానికి రోజాను ఆహ్వానించాడు. ఆమె తనభర్తతో వచ్చింది. వివాహ కార్యక్రమం ముగిసిన తర్వాత ప్రభాకరం రోజాను పలకరించాడు.

'రోజా! కులాసాగా ఉన్నావా?' అని.

'కులాసాగానే ఉన్నాను. ఆరోజు క్లబ్బులో జరిగిన సంఘటన నా జీవితాన్ని పూర్తిగా మార్చివేసింది ప్రభాకరం!' కృతజ్ఞత నిండిన చూపులతో ప్రభాకరాన్ని చూస్తూ అంది రోజా.

'ఆ సంఘటన నిన్ను, నన్నూ కూడా మార్చివేసింది. ఒక్కొక్కసారి చెడు సంఘటన నుండి మంచి ఉద్భవిస్తూ ఉంటుంది. అందుకు తార్కాణం మన విషయమే!' అని తనభార్యను రోజాకు పరిచయం చేశాడు ప్రభాకరం.

ఇద్దరూ చిరునవ్వుతో పరస్పరం నమస్కారాలు చేసుకున్నారు—

రోజా తనభర్తను ప్రభాకరానికి పరిచయం చేసింది — ఇద్దరూ ఆప్యాయంగా ఒకరి ముఖంలోకి మరొకరు చూసుకుంటూ కరచాలనం చేసుకున్నారు.

బంధువులతో, అతిథులతో కిటకిటలాడుతూ ఉంది సుందరరామయ్యగారి యిల్లు. పెళ్ళిరోజు రాత్రి భరతనాట్యం లలిత సంగీత, జానపదనృత్యాలను ఏర్పాటు చేయించారు సుందర రామయ్యగారు.

ఇంత సందడిలోనూ పార్వతమ్మగారూ, అన్నపూర్ణమ్మగారూ శారద తమ కుటుంబాలకు చేసిన ఉపకారాలను తమ తమ బంధువులకు వివరించి చెప్పసాగారు. అందరూ శారదను వేనోళ్ళా పొగుడుతూ ఉంటే సుందరరామయ్యగారి హృదయం ఆనందంతో పొంగిపోసాగింది. సంతోషం పట్టలేక పోయారు.

ఆ సమయంలో వారికి లక్ష్మి గుర్తుకు వచ్చి కనులనిండా నీరు తిరిగింది. అప్పుడే అక్కడికివచ్చి వారిని ఆ స్థితిలో చూసిన శారద వారి ఆందోళనకు కారణం తెలియక తికమక పడుతూ 'ఇదేమిటి నాన్నారూ? ఏం జరిగింది...?' అని ప్రశ్నించింది.

శారదను ఆప్యాయంగా దగ్గరకు తీసు

కాని ఆమె తల నిమురుతూ 'మీ అమ్మ గుర్తుకు వచ్చింది తల్లీ! ఇదంతా చూసుకొనే భాగ్యం ఆమెకు లేదన్న విషయం తలపుకువచ్చి బాధ కలుగుతూ ఉంది.' కండువాతో కళ్ల నద్దుకుంటూ అన్నారు సుందరరామయ్యగారు.

'నాన్నారూ!' గద్గదస్వరంతో అని తను కూడా కంట తడి పెట్టుకొని తండ్రి గుండెల్లో తల దాచుకుంది.

అంతలో తనను శ్రీపతిగారు పిలిచినట్లు విన్న సుందరరామయ్యగారు శారదను ఊరడిస్తూ కళ్లు తుడుచుకోవలసిందిగా ఆమెకు చెప్పి అక్కడినుండి వెళ్ళిపోయారు.

శ్రీపతిగారితో, ప్రభాకరంతో మళ్లీ శారద ఉన్న చోటికివచ్చారు సుందరామయ్యగారు.

'అమ్మా శారదా! పసిపిల్లవాడివంటి మనస్తత్వంగల ప్రభాకరాన్ని నీకు ఒప్పగిస్తున్నాను, అయినా నీకు ఒకరు చెప్పవలసిన అవసర మేముంది? నా కన్నా వాడిని నీవే బాగా అర్థం చేసుకోగలిగావు. నీ కన్నీ తెలుసు. మా యింటి మహాలక్ష్మివై పది కాలాల పాటు పిల్లాపాపలతో పచ్చగావర్ధిల్లు తల్లీ!'అని శారదను దీవించారు శ్రీపతిగారు.

'పెదబాబుగారూ!...' అని వారిపాదాల వంటి నమస్కారం చేసింది శారద.

'లే తల్లీ!' అని లేవనెత్తి శ్రీపతిగారు 'అమ్మా! అదేం పిలుపు? చనువుతో మామయ్యా అని పిలువు.'

'అలాగే మామయ్యా'– శారద.

'నీవంటి కోడలు లభించినందువల్ల మా యిల్లు పావనమైందమ్మా! నేనూ, అన్నపూర్ణ అదృష్టవంతులం తల్లీ!'—శ్రీపతిగారు.

'లేదు మామయ్యా! ఈ అదృష్టమంతా నాదే'—శారద ప్రభాకరాన్ని ఓరగా చూస్తూ.

అక్కడికి ఆ సంభాషణ అంతటితో ముగిసింది—

* * *

మూడురోజులు గడిచిపోయాయి. బంధువులంతా వెళ్ళిపోయారు.

ఒకరోజు శ్రీపతిగారింట్లో నూతన వధూవరులు, సుందరరామయ్యగారు, పార్వతమ్మగారు అంతా సమావేశమయ్యారు.

'అమ్మాయి శారద చలవవల్ల మా సమస్య తీరిపోయింది. ఆమె ఋణం ఈ జన్మలో తీర్చుకోలేము. ఇంత త్వరలో పరిస్థితులు చక్కబడతాయని నేను ఊహించ లేదు.' ఆప్యాయంగా శారదను చూస్తూ అన్నారు లక్ష్మయ్యగారు.

'అలా అనకండి మామయ్యగారూ! మీకు ముందుగా ఋణపడింది నేను. మీ ఆదరణ, అత్తగారి ఆప్యాయత, సహాయంలేక పోయి వుండ్లైతే నా జీవితం ఏమై ఉండేదో! మీరు చేసినదాంట్లో నే చేసినదెన్నోవంతు?'. శారద.

'తల్లీ! నీ వెప్పుడూ యిలాగే అంటూ ఉంటావు. నీ మంచితనం ఎవరికి తెలియదు?' అన్నపూర్ణమ్మగారు తమ

# ప్రతివారికీ రక్షణ కావాలి




ఈ రక్షణ బాక్టీరియానుండి, చెమట
వాసననుండి—మీరు, ఇతరులు
సంకోచపడే అవస్థనుండి—
జి-11 (హెక్సాక్లోరోఫిన్)తో
కూడిన
సింథాల్ టాయిలెట్ పౌడరు
మీకీ రక్షణలన్నీ ఇస్తుంది.

ఇవేకాదు—సువాసన...
సుమసుగంధము.

సింథాల్—
దుర్గంధములనుండి
సంపూర్ణ రక్షణనిచ్చు
టాయిలెట్ పౌడరు

Interpub/GP/5 Tel.

# నిత్యజీవిత సత్యాలు

భరణాల జగన్నాథరావు



'అమ్మా! అమ్మాయ్ గోరూ'

'......................'

'రాధమ్మగోరూ తలుపు తీయండమ్మా'

'అబ్బా ఉండవే...కాకిగోలానువ్వూనూ... ప్రాణాలు తీసేస్తున్నావు ఉదయాన్నే'

'ఏటమ్మా! మళ్ళీ పడుకుండి పోనారు. నాకు టైమైపోనాదమ్మ గోరూ! లెగండమ్మా...ఐదు కొట్టేసినారు'

'అయ్యబాబోయ్ ... అప్పుడే ఐదైపోయిందా...ఉండు వస్తున్నా!'

*  *  *

'అమ్మా! కుసింత సింతపిక్కొడీరూ!'

'అంట్లు గబగబా తోమకుండా నా ప్రాణాలు తీయడానికి రాక్షసిలా ఉదయాన్నే తయారవుతావు...వెధవకుంపటి... ఎంతసేపటికీ అంటుకోదు... వెధవది తడి బొగ్గులూ ... తడికుంపటీ. ఏలాగంటుకుంటుంది...ఉండు! వస్తాను...'

'అమ్మా! నాకాలీపుత్తోంది ... మల్లా ఆ రాముడమ్మగోరు కూకలేత్తారు ఆలీసం అయితే! కుసింత బేగి ఒడేండమ్మా'

'ఇలా మరీ ప్రాణాలు కొరుక్కుతినకే ఇంద...శుభ్రంగా తోము ... నివ్వు సమంగా తోమలేదు...నిక్షేపంలాంటి శేరున్నర పాలూ విరిగిపోయాయి. మూడ్రోజులయింది ఆబిండె తోమి. దాన్నికూడా ఆ చేత్తోనే తోమిపడేయి.'

'అలాగే లేండమ్మగోరూ!'

*  *

'ఎల్తాన్నమ్మ గోరూ!'

'వెళ్ళవే! వెళ్ళు ప్రతిపనీ నన్నడిగి చేస్తున్నట్టు. వెళ్ళు...వెళ్ళు'

'అది కాదండీ ... కుసింతా కాఫీసుక్క'

'ఆఁ! రాణీగారు తాగుతారని ఆరు గంటలకే కాఫీ సిద్దంచేసి ఉంచాననుకున్నావేమిటి! తర్వాత ఎనిమిదిగంటల కిస్తాలే. రాత్రి ఉంచినపాలు, అయ్యగారికి, పిల్లలకి కాఫీలకే చాలవు ...నీ కెక్కడినుంచి తెచ్చి పోసేది.'

*  *  *

'బాబా నిద్ర లే నాయనా! స్కూలుకి టైమైపోతోంది!'

'......................'

'ఒరే నిద్ర లే! అదుగో చూడు పక్కింటి పాప లేచి పోయిందప్పుడే'

'......................'

'ఒరే వెధవా రాజీ! లేస్తావా? లేకపోతే నడ్డి మీద నాలుగెయ్యమంటావా?'

'......................'

'అమ్మ పెట్టేవి రెండూ పెద్దేగావి నిద్ర ఒదలదురా. నిద్రలో మాత్రం ... తండ్రి బుద్దులు పూర్తిగా పుణికి పుచ్చుకున్నావు'

'ఊఁ!......ఊఁ!... చాలు నాన్నా ... అమ్మ'

'ఏడ్చేవంటే మరి నాలుగు తగల గలవ్ జాగ్రత్త! ఆ బాత్రూమ్‌లో కెళ్ళి మొహమిడ్చుకో!... లేకపోతే ఇక తోముకోనవసరం లేకుండా ఆ పళ్ళూడగొట్టేస్తాను జాగ్రత్త!'

'ఊఁ!......ఊఁ!'

'ఉండు వస్తున్నాను...నీకిలాగ మంచి మాటలతో చెప్తే లాభంలేదు. రోజూ ఈ పెద్ద గుర్రానికి కూడా నేనెక్కడ పళ్ళు తోమేదిరా! భగవంతుడా! దగ్గర కొచ్చేదాకా ఏడుపు...తరువాత పరుగు!'

'ఊఁ... ఊఁ... ఊఁ...'

'వేలంత లేవు...నీకప్పుడే ఎక్కడ తెల్లారిందే... కాస్సేపు పడుకో ... నా తల్లివి కదూ!... బబ్బోమ్మా ... మా లల్లీ తల్లి మంచిది. బుద్ధిగా బబ్బుంతుంది...జో... జో...జో!'

'ఊఁ...ఊఁ...ఊఁ...'

'వెధవ గోలా నువ్వూను...లేపితే వేలంత వెధవక్కోపం ... పడుకోమంటే పసిముండక్కోపం... పిల్ల లేడుస్తూంటే ముసుగు మరింత లాక్కోడానికి మీకు మనసెలా ఒప్పిందండీ?'

'గుర్...గుర్...'

'కుంభకర్ణుడైనా కాస్త నయం ... లంక కాలిపోతున్నపుడైనా తెలివొచ్చింది... ఈ కుంభకర్ణుడికి లంకంత కొంప బూడిదైపోతున్నా తెలివొచ్చి చావదు...అయినా నా ఖర్మ...ఎవర్నని ఏం ప్రయోజనం!'

'అమ్మా! నడ్డికి సబ్బు లాత్తావా ?...

కాయవా?'

'ఏం నిటోరం! ఛీ... వెనావాడిలాగ అల్లి మీటుము ... బ్రంగా నడ్డి తోముకుని ఏ... లేకపోతే నాలుగు తగల గలవు.'

'అమ్మా ... దుద్దూ ... దుద్దూ ... అమ్మా...'

'లేపూనే బడ్‌మిస్క్ ... మీ తాతగారి గేదెలెక్కలెగ శాయనే నీకు ఆరుగంట లకే పాల ఇయ్యానికి... గుంటయుండా ... గంటయింది లెపి కాస్త కిందకి దిగి ... పోసుకోరామా!...గబగబా దిగు లేకపోతే ఆ శెంఠోవని గూడా పూర్తిచేసేటట్టున్నావు.

'అమ్మా...దుద్దు...దుద్దు...'

'కిందటి జన్మలో అష్టావధానాలు చేసిన మహామహులంతా ఈ జన్మలో నా పిక్స్ చుట్టుకున్నారు ... వీళ్ళతో శతావధానం చేయలేక ఛస్తున్నాను...ఎగుమతీ, దిగుమతీ కూడా ఒక్కసారే కావలసి వచ్చాయుటే తల్లీ...'

'అమ్మా... నా జోడు...'

'వేలంతలేవు ... నీ సామాను నువ్వు సనుంగా చూసుకోలేవూ? ఆ మంచం కింద ఏడుస్తూందేమో చూడు.'

* * *

'మా పాప మంచిది...ఇందమ్మా...పాలు తాగి ఈ బొమ్మలో హాయిగా ఆడుకో!'

'అమ్మా ... నా పుస్తకాలనంచీ!'

'ఆ గూట్లో ఉంది తగలడు. ప్రతిదానికీ జవాన్లు కావాలి. ఏ మహాతల్లి పూజ చేస్తున్నదోగాని.'

...............

'బాబూ టేబిలుమీద టిఫిను, హోవల్టీను పెట్టాను. టిఫిన్ కానిచ్చి, హోవల్టీన్ తాగి వేగంగా వెళ్ళు నాయనా ... నా బంగారు తండ్రివిగాని.'

'అమ్మా ... నా నాకోవల్టీనొద్దు ... తాపే కావాలి.'

'నీక్కాఫీ కావాలా ? ఉండు మీ నాన్న గారిని లేపుతాను ... వేడిగా కాచి యిస్తారు.'

'అమ్మా... మా బ చ్చొ చ్చిం ది నే స్కూలుకిపోతా టాటా'

'టాటా'

* * *

'ఒదినా నే స్కూలికి పోతున్నా!'

'వెళ్ళు రామం ... ఈ యి ం ట్లో నా ప్రాణాలు తీయకుండా నీవని చూసు కానేవాడివి నువ్వొక్కడివే ... కే రే జీ పంపేస్తానుగాని... అలా వచ్చేటప్పుడు కమ లమ్మగారినడిగి ఆ డిజైన్ల పుస్తకం తీసు కొద్దూ...'

'అలాగే వదినా!'

'అమ్మ... ఈరెండు ఘటాలూ వది లాయి. నా ప్రాణాలు తెరిపిన బడ్డాయి.'

* * *

'నాధా'

..............

'నాధా'

'గుర్...గుర్...ర్'

'ప్రాణేశ్వరా! యిష్మసఖి సుప్రభాతము పాడుచుండగా ఇటుల నిద్రాదేవి ఒడియం దొదిగి ఉండుట తమకు భావ్యమా?'

'అబ్బ...ఉండు రాధా!...అసలే రాత్రంతా నిద్రలేదు...

'పెద్దగొప్ప! మీ ఒక్కరికేనేంటి...నిద్ర లేంది ...ఇక లే వం డి... ఎ ని మి ద వ వస్తోంది...'

'అబ్బా! ఎనిమిదేగదండి శ్రీమతీ! తొమ్మి దింటికి లేపితే కలకాలం మీకు చరణ దాసునిగా పుట్టించమని ఆ కమలనాభుని ప్రార్ధించుతా...దేవీ!'

'లెమ్మంటూంటే... ముసుగు తంతున్నా రేమిటండీ... ఇవాళ ఆఫీసులో ఆదేదో ఆడి టింగులాటి ... దేదో...' 'అబ్బ ఏంటండీ! మరీ చిన్నపిల్లాడి బుద్ధులూ మీరూనూ! ఎవరైనా చూస్తే న వ్వి పో తా రు... ఒదలండీ... అబ్బ ఒదల మంటూంటే... కొంటెబుద్ధులూ మీరూనూ ... ఆ సుశీల చూస్తే నా ప్రాణాలు తోడేస్తుంది'

'ఫరవాలేదు రాధా! ముఖం నిండా గాట్లు పెట్టేస్తే నీకు రాత్రి దయ్యం పట్టిందను కుంటుంది గాని ... నా మహత్యమనుకోదు'

'సరేగాని ... ముఖం కడుక్కోండి ... కుంపటి మీద పాలు పొంగి పోతున్నాయి. వేగంగా పోవాలి'

'అలాగే కాని...ముందు అగ్గిపెట్టెలా అందుకో'

'ఉదయాన్నే అందమైన ఆ నిద్ర మోముతో అగ్నిహోత్రుడికి సేవచేయక పోతే పెద్ద ప్ర మా ద ం లేదు ... గాని ముందు...'

'లాభం లేదు!... ఫస్టు సిగరెట్ నెక్స్ట్ కాఫీ...తర్వా...ఫేస్...ఎట్సెట్రా...'

'సంతోషించాం గాని ... ఇదండి అగ్గి పెట్టె...'

'వెరీగుడ్! అలా దారికి రా!'

'రాకపోతే చస్తానేంటి?...ఎంత చదువు కున్నా ఆడపక్షిని కదా?'

'రాధా! నువ్వన్నావు కాబట్టి సరి పోయింది ... లేకపోతే నా అర్ధాంగిని ... పక్షితో పోల్చిన ... ఆ శ్రీ ... ం డి ... ముక్కుమం ... జెవులుమం ... కోసి ... అవమాన...'

'చాలించండి. మీ లక్ష్మణ కుమారుడి డప్పాలు. ఇదుగో దాని పెద్దమ్మనండు కోండి'

'రాధా! కాఫీ+సిగరెట్=స్వర్గం, అని కాళి దాసు కాదంబరి కావ్యంలో సెలవిచ్చినది ... తెలుగు భాషలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తపాలా బ్రహ్మచారి (పోస్ట్—గ్రాడ్యుయేట్) పట్టా పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణు రాలవయిన... నీకు తెలియక పోవుట నాకు కడుంగడు ఆశ్చర్యమును ... కలుగచేయు చున్నది!'

'ఏమండోయ్! ఉదయాన్నే డిగ్రీ గుర్తు చేశారంటే చించి కుంపట్లో పడేయగలను జాగ్రత్త!'

'దేవీ! నీ ప్రియుడు నీపాద తాడనమునకైనను వోర్వగలడుగాని,... నీ పవిత్రమైన, పట్టాఖననమునకు మాత్రము అంగీకరింప జాలడు.'

'కవిత్వం... కాస్త కట్టిపెట్టి... కాల కృత్యాలకి ప్రారంభోత్సవం చేస్తే, ఆసేతు హిమాచల పర్యంతం... ప్రజలంతా సంతో షిస్తారు!'

'చిత్తము దేవీ!'

* * *

'రాధా సోప్'

'అబ్బ ! జాగ్రత్తగా చూడండి ఆ బాత్రూమ్‌లోనే...సుపుత్రులు ఇప్పుడే స్నానం చేశారు కదా ... ఆ బాల్చీపక్క నుందేమో. గూట్లో లేకపోతే చాలు అరవటానికి...'

'ఆల్‌రైట్... దొరికింది - కాని నాకె బ్రుట్ టవల్.'

...........

'దొంగగారికి ... కాస్త టవల్ తీసుకెళ్ళ డానికి కూడా తీరికలేదు... ఇందండోయ్.

# నిత్యజీవిత సత్యాలు

అవతల పొయ్యి మాడిపోతోంది ఇక మళ్ళీ వీలివారంటే ... మీకు కంచంలో ఖాళీయే గుర్తుంచుకోండి!'

'అల్లాగే! ... ప్రేయసీ ప్రేమగా ... పిలిచిన వేళా లలల,లలా ... నీ పైటయే టవలుగా మారిన...వేళా...ఆ...ఆ!...'.

'ఇదిగో! ఆ సంగీతం ఆపి ... ఆ కొంగు వదులుతారా? లేకపోతే నన్నిక్కడే కూల బడమంటారా? చెప్పండి...'

'వేగంగా స్నానంచేసి డ్రసప్ అవండి ... తొమ్మిదిన్నర అవ్వొస్తోంది.'

'అలాగే...లలాలా...లలాలా.'

'రాధా...రాధా...రాధా.'

'అబ్బ ఏమిటండీ! కొంప లంటుకుపోయి నట్టు! మిరపకాయ తిన్న కాకిలా అరుస్తున్నారు...వస్తున్నా...ఆగండి! వెధవ ముఖం కాదలు ఏంత పేపటికీ ఉడికి చావవు.'

'దేవీ! నీ ప్రియుని మోము తిలకిం చితివా ?'

'అబ్బ!... పూర్ణచంద్ర బింబంలా... అందంగా ఉంది గాని...అసలు సంగతేమి టండీ ?'

'ఇలా రా!...రాధా.'

'ఏంటండీ! మరీనూ. సిగ్గు లేకపోతేసరి. వాల్ రూమ్ గోడకి నగానికి పైగా లేచి పోయూరు. కాస్త ప్రజల సుఖంకోసం ఆ టవలైనా భుజం మీద వేసుకోండి.'

'తదీయ ఆజ్ఞాపాలన చేసెదను...గాని మృదువైన తమ కోమల హస్తముమ ఈ తలకు చేరియుండుంచుడు.'

'అయ్య బాబోయ్ గెడ్డం...ఏంత పెరిగి పోయిందో? ఇంతదాకా చూసుకోలేదేమండీ? ఆ ఆఫీసరు చూశాడంటే...సిక్ సర్టిఫికేట్ తీసుకుని ముందు కె. జి. హెచ్. లో జాయి నవకుపరలదు జాగ్రత్త...అయినా ! మీరు గెడ్డం గీసుకోపోతే నన్నేం చేయమంటా రండీ? అప్పన్నని పిలవమంటారా? లేకపోతే మీరు గెడ్డాలు పెంచినందుకు సంతాప సూచకంగా వంటింట్లో వో సభ ఏర్పాటు చేయించమంటారా?...చెప్పండి.'

'ఉందు రాధా నీ కెప్పుడూ వేళాకోళమే ...వేగంగా ఆ మిర్రరూ...దేవతార్చన పెట్టె అందుకుందూ...'

'అందుకుంటా గాని ... నా కేంటి ఇస్తారు?'

'అదుగో మనదేశాన్ని అధోగతికి దించే స్తున్నదీ లంచమే...

ఇంట్లో షేవింగ్ సెట్టు అందుకో వాలంటే భార్యకి లంచమే. కొడుకు బాగా చదవాలంటే వాడికి సినిమా లంచమే. గిన్నెలు బాగా తోమడానికి లచ్చికి కాఫీ లంచమే లంచమ్ ... లంచమ్ ఎవ్విరివేర్...బటే నాకె లంచమ్ టుమి టు టేక్ ఎండ్ స్పెండ్.'

'ఇప్పుడే బ్రతికుంటే ... మీ కవిత్వాన్ని వినలేక షేక్స్పియరు సీసాడు పొటాషియం సైనేడు తాగేసి ఉండేవాడు ... చావడానికి ఎక్కువ టైం తీసుకుంటే మీ పద్యంలో చివరపాదం వినాలని.'

.............

'అయ్యయ్యో...గడ్డం బాగా పెరిగెనే... లలలా...'

'ఆ పాటని ఖూనీ చేయడం కట్టి పెట్టి...ఇదుగో మీ సౌందర్య సాధనాల్ని అందుకోండి ! నా కవతల పనుంది.'

'ఆఁ...వెళ్లిన వెంటనే షేక్స్పియరు పరిస్థితెలా ఉందో ఉత్తరం వ్రాయి.'

'ఆలాగేగాని...వేగంగా డ్రసప్ అయిరండి ...తర్వాత ఆలస్యం అయిందని నన్నంటే ఊరుకోను.'

'ఏం? ఊరుకోకపోతే పరువునష్టం దావా వేస్తావా?'

'ఊఁ! చెప్పుంటే మీకాక్కదూ ?'

'చిత్తము...దేవీ చిత్తము'

• • •

'రాధా ! ...నా మేజోళ్ళు'

'ఉండండి...సర్కార్‌గారి మేజిక్ షోలో కుందేళ్లలాగా పరుగెత్తు కొస్తాయి ... ఆ టేబిలుకింద చచ్చిన ఎలుకల్లాగ పడుం టాయి...తొడుక్కోండి.'

'ఒక్కటే ఉంది రాధా'

'వెధవ ఉడతముండ ఈడ్చుకెళ్ళి ఉంటుంది. ఆ బీరువాలో ఫేంట్ల కింద కొత్తజత ఉంటుంది... వేసుకో-డి...పాతవి తరువాత తాపీగా వెదుకుతాను'

'మళ్ళా పాతజత వెదుకుతానని ఆనంద సాగరంలోఉన్న నన్ను కష్టాల కాలువలోకి ఈడుస్తావా ప్రేయసీ?'

'వెదకడం మానేస్తా...గాని...గబ గబా రండి. అవతల భోజనం చల్లారి పోతోంది?'

'అలాగే! గాని ... రాధా వాటెబవ్యుట్ మై...'

'టై...అంటారు అంతేనా...గొంతులో ముద్దపడిన తర్వాత ఆ ఉరి బిగించుకుందురు గాని ముందు త్వరగారండి...'

'హోయ్యస్...నేను రడీ! ... రాధా మరి నువ్వో'

'నేను వడ్డించుకుంటా...గాని ముందు మీరు మొదలెట్టండి. మీతో మొదలెడితే ఇవాళ అయినట్టే...'

'అబ్బ! ... ఏంటండీ! ఎక్కాలు రాని మూడోక్లాసు కుర్రాడిలా చేతులు కట్టుకు కూచుంటారు...మొదలెట్టండి!'

'అ...'

'అబ్బబ్బ ఈచాకిరీ చేయలేక చస్తున్నాను...ఆ భగవంతుడు నాకు నాలుగు చేతులిచ్చినా బాగుండును'

'ఆ నవ్వు ... అనవసరంగా దాచేయకు ప్రమాదం...గోదావరినదిలా గట్లు తెంచు కొని...వెన్నెలలా విరబోసుకుని...'

'ఫుల్‌స్టాప్! ఇందండి...పప్పూ బువ్వా ఆం... పెరుగూబువ్వా..ఆం!'

'అమ్మా...అమ్మా...'

'ఎవ్వరా ఆగండి...ఒక్క అయిదు నిము షాలు...'

'కూరా బువ్వా...'

'అమ్మా పెద్దమ్మాటమ్మా...తలనొస్తోం దమ్మగారూ'

'చాకలి ... రాస్కెలుగాడు పానకంలో పుడకలాగ ఇప్పుడే తగలడాలి!'

'వేగంగా భోజనం కానీండి ... నే వెళ్లొస్తా.'

'.........'

'అమ్మగోరూ తలుపేసుకోండి... కుసిన్ని టీనీళ్ళు తాగివస్తాను.'

'వెళ్ళు నాయనా!...నీదే ఆలస్యం.'

* * *

'రాధా...నే వెళ్లొస్తా.'

'చిత్రం ... ఆమాట తను వద్దనుండి ఎంత వేగంగా వస్తుందోనని ఎదురు చూస్తున్నాం.'

'కాని రాధా!...వాటెబవ్యుట్ మై...'

'ఏంటండీ! ... ఇంకా ఏం ... మిగిలి పోయాయి మీ సేవలు.'

'ఇంత జ్ఞాపకశక్తి లేనివానిని ... ఆ తెలుగూ ఎమ్మే ఎలా పాసయ్యావని...

'మీకూ వచ్చింది ఆ సందేహం...రామన్ గారు ఆ సందేహ నివృత్తి కోసం... ఆలో చిస్తూనే ... నోబెల్ బహుమతికి తెసిస్ తయారు చేశారట. ఇంతకీ మిగిలిపోయిం దేమిటో'

'నువ్వు ప్రేమగా యిచ్చే...ము...'

'ఏంటండీ... ము...అంటారు. ముంగిస లాగ!'

'అదికాదు రాధా ... ఇప్పుడు నేనిచ్చాను చూశావ్...అదీ!'

'ఛా! ములంకాడ వానా ... మీరునూ బుద్ధిలేక పోతేసరి... భలే...భలే...లిప్‌స్టిక్ అంటుకుంది లెండి మీ బుగ్గలకి...'

'అయితే ఇవాళ ఆఫీసులో నేను గాని... ష్టినో సుజీగాని డిస్మివ్వన్నమాట'

# నిత్యజీవిత సత్యాలు

'ఉండండి ...! కర్చీవుతో తుడుచు కోకండి. రంగంటుకుంటుంది... ఇదిగో ఈ చీర కొంగుతో...'

'అదీ...అలా దారికి రా!'

'హోకే...మరి నే వెళ్ళొస్తా.'

'చిత్తం.'

'వీలయితే సుశీల ద్వారా నీకు రెండు... ళు...'

'అదుగో ఆ మాటలే అనొద్దన్నాను...'

'సారీ . సుశీలవాళ్ళ ఫోను ద్వారా...'

'హోకే'

'హోకే.'

* * *

'అమ్మగోరూ!'

'ఎవరదీ?'

'నేనండీ చాకల్ని. కుసింత పద్దు సూసే నారంటే ఎల్లిపోతాను !'

'సర్లే వస్తున్నాగాని బట్టలన్నీ పేర్చి ఉంచు'

'సద్దేసానమ్మా.'

'సమయానికి ప్రతీదీ ఏడిపించటమే... ఈ పద్దు పుస్తకమెక్కడ తగలడిందో?... ఆఁ! దొరికిందిలే...ఏదీ...మూడు నాలుగు కమీజాలు, మూడు పేంటులు, 6 చీరలు...

'ఐదు చీరలే ఉన్నాయమ్మా! ఒకటి లలితమ్మగారి ఇంటికాడున్న మూటలో మరసి పోనాను!'

'సర్లే...అది తీసుకొచ్చి, డబ్బు తీసు కొని కొత్తపద్దేయించుకో'

'అలాగే నమ్మగోరూ!'

* * *

'టక్...టక్...టక్'

'నువ్వా సమయానికే తగలడాలి! ఇళ్ళూ వాకిళ్ళూ తుడిచి నీళ్ళు తోడేసి దయ చేయి'

'అమ్మగోరూ...మరి కాఫీ!'

'తప్పుతుందా! ఆమూల ఫ్లాస్కులో ఉంది తాగి శుభ్రంగా కడిగి లోపల పెట్టేయి.'

'అమ్మగోరూ...సిన్నబిందె ఏడున్నాది?'

'అబ్బ ఊరుకోవే! ఒక్క క్షణం కూడా తిరిగ్గా కూర్చోనియ్యవ్ స్వీట్—హోమ్ ఎంతో ఇంటరెస్టింగ్‌గా చదువుతూ ఉంటే మధ్య పానకంలో పుడకలాగు ... నువ్వూ... నీ బిందెలూనూ'

'అమ్మగోరూ! మరి పిలటరేదాడినాదు'

'అబ్బ నా ప్రాణాలు తీయకే...కాఫీ... ఫిల్టర్, ఒకటే గొడవ...ఉదయం నుంచీ. నాకేగనుక అధికారమొస్తే ఈ బెడ్‌కాఫీ గాళ్ళందరినీ ... ఏం చేసేదాన్నో తెలుసా? వేడిగా ఉండే కాఫీ టాంకులో స్నానం చేయించి, గొంతుదాకా కాఫీ గళ్ళా పెట్టి పోసి, ఒక ఈజన్మలో కాఫీపద్దు బాబోయ్ అనేటట్టు చేద్దును...'

'ఒక్క అన్నయ్యగార్ని తప్ప!'

'హో సుశీలా...ఏంటి ఇలా దిగబడ్డావు? ఏంటి కథ ... ఇవాళ అల్లికలమీద ఇంత ఇంట్రస్టు...ఇంతవేగంగా కొట్టుకొచ్చావ్!'

'ఆఁ! ఏంలేదూ! మొన్న జాకెట్టు కత్తి రించాను చూశావా! అదెక్కడినుంచి మొ

కట్టి ఎలా వార్త చేయాలో తెలియడం లేదు...కాస్త చెబుదురూ?'

'చూడు...ముందా నెక్ మడచికుట్టుకో... తర్వాత చేతులకి చేతికుట్టేసుకో... ఆ తర్వాత నడుమూ...అలా చేత్తో పూర్తిచేసి తర్వాత మిషనెక్కు'

'అబ్బా! బోరండీ! రెండుసార్లు... ఏకంగా ఒక్కసారే మిషనుమీద కుట్టేస్తాను!'

'సరే నీయిష్టంగాని జాకెట్టు మాత్రం పంచదార బస్తాలాగొస్తే మాత్రం నామీద గోలపెట్టకు'

'అయ్యో బాబోయ్! అసలే బిగిలినిది కూడాను. అలాగే చేతికుట్టేసి చూపెడతా గాని ముందా పత్రికనిలా పడేయండి!'

'జాగ్రత్త! ఇంటికి మాత్రం పట్టుకుపోకు ... మీ అన్నయ్యగారింకా చూడలేదు.'

'అలాగే లెండి! బొమ్మలు చూసి... మళ్ళీ ఇచ్చేండి!తీసుకెళ్తా!'

'మా పుస్తకాలు పట్టుకెళతావు గాని... మహాతల్లీ! జ్యోతి తీసుకొచ్చి ఇవ్వడానికి ఇంకా ముహూర్తం కుదరటం లేదేంటి?'

'సారీ! సాయంకాలం... ఇస్తా లెండి'

'అక్కయ్యగారూ! పుస్తకం టేబిలు మీద పెట్టేస్తున్నా. సాయంకాలానికి జ్యోతి తీసుకొస్తా ... గాని, మీరు మాత్రం ఆ డిజైన్ల పుస్తకం మాత్రం వెదికి పైకి తీసి ఉంచండి!

'అలాగే ఇప్పుడే చెప్పిపంపాను మా రామాన్ని కమలమ్మగార్ని అడిగి తీసుకు రమ్మని'!

'తలుపేసుకోండి'

* *

'అమ్మా! నా టిఫిన్!

'రేవట్నుంచి రోడ్డుమీద పెట్టి ఉంచుతానుగాని ఇవాళ్టికి డైనింగ్ టేబిలు మీదుంది...కాస్త కాళ్ళు కడుక్కొని తిని... నా ప్రాణాలు తీయకుండా ... అలా ఆడుకుని...రా!'

'ఓయ్యస్ మమ్మీ'

'రాజా! చెల్లాయిని తీసుకొని ... అలా పార్కుదాకా పోయి రాకూడదూ!'

'అలాగే మమ్మీ!'

'ఆ చింపిరి జుట్టుతో వెళ్ళక కాస్త తలదువ్వుకో !'

'నే వెళ్తొస్తానమ్మా ఆడుకుందుకి ... చెల్లాయినికూడా తీసుకెళ్తున్నా!'

'వెళ్ళుగాని...చెల్లిమీద మట్టి పోయకుండా జాగ్రత్తగా ఆడుకొనిరండి ఇద్దరూ !'

# ఓం నమః శివాయ

కం. జంబుకేశ్వరా జగతిన్
జంకేల జాలమేల తాళజాలనె
జపతపమా, తత్ఫలమా
జగత్పతి జాగ్రత్త జయభేరి మ్రోగింపు॥

కం. జగజ్జనకా జనించితిన్
జననీ గర్భవాసలో జనించె నీ భక్తిన్
జగడమాడ నీతో
జగదోద్ధార జాలిజూపు పంపాపతీ॥

కం. జరిగిందేమిటి జరుగనది
జడపదార్థమై జీవింప జీవిత జాలునీ
జంగమలింగ, గనువిప్పుము
జడిసెదవో, జడిపించెదవో నే నెరుగని -

కం. జగమేలే పరమాత్మ
జననుత వినుత వంద్య వింధ్యహిమగిరిసాంబ
జయ జయ ఝుంఝూటఝురే
జగంబును జాగరూకుడై జపమాచరింపుమా॥

రచయిత్రి: శ్రీమతి సరస్వతిగిరి

* *

'అమ్మగోరూ...నే పోయొస్తా'

'వెళ్ళుగాని...రేపు కాస్త వేగంగా రా'

'ఇప్పుడలాగ అంటారుగాని రేపటేల తిట్టిపోస్తారు'

'మనిద్దరికీ రోజూ ఉన్న తగువేగా అది! గేటు తలుపులువేసి మరీ వెళ్ళు ... లేకపోతే పూల మొక్కలన్నీ ఖాళీ'

* * *

'హలో! వనలక్ష్మిగారూ! గుడీవినింగ్!'

'హలో! కమిన్‌సర్! క్లబ్‌లోని పేకల స్టాకు లేకపోవడం వల్లనా, లేక చతుర్ముఖ పురాణానికి ముఖాలు తక్కువవడం వల్లనా, ఈ ధర్మరాజుగారి అకాల ఆగమనం'

'సరేగాని రాధా! ఇవాళ మహాగనోము సినిమాకి వెళ్దామా ?'

'చిక్కటి వెన్నెలరాత్రివాడు సెకండ్ షోకి వెళదామన్న మీ నాలికని...ఏవిధమైన మాటలతో సమ్మానించాలో నా కర్థం గావటం లేదు ..'

'సారీ ఫర్మై డర్టీ ప్రపోజల్! ఆ లాసీసా తీసుకెళ్ళి డాబామీద పెట్టు: ఇవాళ హనీమూన్ జరుపుకుందాం హాయిగా...'

'ఓకే బాస్! ప్రాణనాథా అంటానికి మరీ బోరుగా ఉంది...మరేమి అనుకోకండేం'

'డోన్ట్ వర్రీ! పిల్లల్ని కాస్త వేగంగా... ని...'

'మీరు చెప్పనక్కర లేదుగాని... ఇవాళ్టి పేపరులో తలదూర్చండి!'

* *

'బాబూ! ... లల్లీ ... చక్కగా బువ్వ తిన్నారుకదా. ఇక హాయిగా బజ్జోండి ...'

'అమ్మా! కత చెప్పవూ!'

'బాగుంది వరస! ఇక్కడ మీకు కథలు చెప్తుకుంటూ కూచుంటే ... వంటింట్లో నా పని... మీతాత ఎవడు చేస్తాడు?... నేను వేగలేను బాబూ! హాయిగా కళ్ళు మూసుకు పడుకోండి కబుర్లాడుకుంటూ'

'నాకు నిద్రాల్తాతం లేదమ్మా'

'లల్లీ! కథ నేను చెప్తాగాని ...

# నిత్యజీవిత సత్యాలు

ఊ కొడుతూ కళ్లుమూసుకు పడుకోండి.'

'అలాగే నాన్నాలూ'

'అనగా ... అనగా ఒక ఊళ్లో ఒక అమ్మా యుండేదట'

'ఊ...వేగంగా చెప్ప నాన్నా'

'ఆ అమ్మాయిని ఊళ్లో వాళ్ళంతా ... ఎర్రతేలూ అని పిలిచేవారట'

'ఉండు బాబూ! తర్వాత నే జెపుతా! ఆ ఎర్రతేలుకీ, వో మండ్రగబ్బకీ పెళ్ళయిందట ఒకరోజు'

'ఒత్తి చెత్తకథ...మీరుపొండి ... నేనూ చెల్లాయీ ఇంచక్కా, రాజుగారూ ... ఏడు చేపలూ కథ చెప్పుకుంటాము'

'వోకే దెన్...గుడ్‌నైట్ కిడ్స్!''

'గుడ్‌నైట్ డేడీ అండ్ మమ్మీ!'

* * *

'అబ్బ అజంతా శిల్పంలాగున్నావు రాధా ఇవ్వాళ, పాలరాతి పొరల్లాంటి ... తెల్లని నీ చీరమడతలూ, కృష్ణవేణి కెరటాలాంటి నల్లని నీ కురులూ ... మీనుల్లాంటి సోగ కన్నులూ...వెధవది... జువాలజీ పాఠాలు చెప్పటం మానేసి తెలుగు వెలిగించి ఉంటేనా ... నీ అంద చందాలమీద ఈ పాటికి వో ఖండ కావ్యం వ్రాసి ఉండేవాడిని కదా...'

'ఆ ఒక్క విషయంలో మాత్రం భగవంతుడు నాకెంత మేలుచేశాడో చూడండి. ఇక కవిత్వానికి కళ్లెంవేసి... ఇందండి'

'నువ్వుకూడా కొంచెం...'

'అబ్బ ఎన్నిసార్లు చెప్పాలండీ నాకొద్దని'

'ఫరవాలేదు గాని ... రాధా ... నిన్ను చూస్తుంటే... ఏమనిపిస్తుందో తెలుసా... నువ్వులేకుండా... ఈ జీవితంలో వో ఇరవై ఐదు సంవత్సరాలు... ఎలా గడిపానా...అని'

'మీ కొక్కరికేనా ... నాకుమాత్రం... రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి. రోజంతా పడిన శ్రమని...మీ సన్నిధిలో...మీ సేవలో మరచిపోతుంటాము. కొడుకుమీద తండ్రి బాధ్యత, పిల్లలమీద తల్లి ప్రేమానురాగాలు భర్త సేవలో భార్యకు లభించే ఆనందం,... భార్య సరసన భర్తకు లభించే శాంతి ... ఇవేనండి జీవితసత్యాలు. శాంతసాక్షి గీత [illegible] [illegible].

[illegible] ... [illegible] ... [illegible]

# ఇస్లామ్ మతం క్రయిస్తవ మతంతో పోటీకి దిగుతున్నదా?

[అంతర్జాతీయ రాజకీయాలలో ఇస్లామ్ మతం మంచి ప్రాముఖ్యత వహిస్తోంది. ఆఫ్రికాలో 'యుద్ధానికి సిద్ధంగా' ఉండే ఇస్లామ్ వార్తలలోకి ఎక్కుతోంది, అయితే, పాశ్చాత్య దేశాలలో ఇస్లామ్‌పట్ల మరొక రకం అభిలాష పెరుగుతోంది; ఇది వ్యక్తిగతమయిన, మత ప్రధానమయిన అభిలాష, ఈ పరిణామాన్ని పరిశీలించే హుసెయిన్ రోఫె ఇటీవల మహమ్మదీయమతానికి మారిన వ్యక్తి, లోక సంచారి. రోఫెకి మతాల మధ్య పోలికలని పరిశీలించటం అంటే ఇష్టం.]

మతోన్మాదం ఇప్పుడు ప్రపంచంలో పెద్ద సమస్యగా వుంటున్నది. పెద్దతరం చిన్నతరం కూడా మతమంటే ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నారు. ఇందుకు కారణం ఏమై వుంటుంది? స్వంత మతం పరిమితమై వుండిపోవడంగాని, ఆ మతంలో వారికి నచ్చని విషయాలు కొల్లలుగా వుంటడంగాని మతం మీద అసంతృప్తి కొద్దీ మతాం గురించి మాట్లాడుకుంటున్నారు. తమకి ఏ మతం ఎక్కువ హితవుగా వుంటే ఆ మతానికి మారుతున్నారు.

యూరప్, అమెరికా దేశాల్లో అగ్రస్థానం క్రయిస్తవమతానిదే. హిందూ మతంలో వర్గభేదాలు కొంతవరకు జనాన్ని ఇబ్బంది పెడుతుంటాయి. అందుకే పాశ్చాత్యులు ఈ మతంమీద ఎక్కువ మోజు కనబర్చటం లేదు. ఇక బౌద్ధము, ఇస్లాం వుంది. ఈ రెండుమతాలూ క్రయిస్తవ మతానికి పోటీగా వుంటున్నాయి.

ఈ రెండు మతాలూ జనాన్ని ఏందుకు ఎక్కువగా ఆకర్షిస్తున్నాయి అని ఆలోచించినప్పుడు ఒక విషయం బోధపడుతుంది. ఇస్లాం మతం వెయ్యేళ్ళుగా యూరప్ దేశంలో ప్రచారమై వుంది. మెడిటరేనియన్ తీరంలో ఒకసారి ఈ ఇస్లాం మతం క్రయిస్తవ మతాన్ని పెద్ద దెబ్బ తీసింది. అప్పటినుంచీ పాశ్చాత్యుల్లో ఇస్లాం మతమంటే కొంచెం కన్నెర.

బౌద్ధమతం కూడా అందరికీ తెలిసిందే కాని, ఇటీవల మాత్రమే ఎక్కువ ప్రచారంలోకి వచ్చింది. చాలా దూరంనుంచి వచ్చిన మతమిది. నిర్భయంగాను నిస్సంకోచంగాను ఆచరించతగ్గ మతమిది. అందుచేత ప్రజల మీద ఎక్కువ ప్రభావాన్ని కలిగివుంది.

అమెరికా ప్రజల దృష్టితో చూస్తే ఇస్లాం మతంమీదనే వారికి ఆసక్తి ఎక్కువ అనిపిస్తుంది 'సూఫీయిజమ్' గురించిన సమస్య వుంది. అది ఇస్లాంలోనే ఒక ఉద్యమంలాంటిది. 'సూఫీయిజమ్' ఇస్లాం మతాన్ని అర్థం కాకుండా చేస్తున్నది. అందుకు కారణం — భారత దేశం నుంచి వచ్చిన కొందరు ప్రచారకుల ప్రచారమే కావచ్చు.

'ఇస్లాం రెవ్యూ' పత్రిక సంపాదకుడు మవుల్వీ అబ్దుల్‌మజీద్ మాటల్లో చెప్పాలంటే— 'ఇస్లాం మతం ఒక ఫేషన్‌గా తయారయింది. కాని, మతంలో సదాచారాన్ని శిరసావహించేవాళ్లు ఈ రకం వ్యామోహాన్ని ఖండిస్తారు. ఇస్లాం మత ధర్మానికి విరుద్ధమైన ఆచారంగా దీన్ని పేర్కొంటారు. మరోటి కూడా వుంది. ఈ మతాన్ని పుచ్చుకోమని ఎవరికీ ఆహ్వానం ఇవ్వక్కర్లేదు. స్వతసిద్ధంగా మతాన్ని పుచ్చుకొంటూ వుంటారు. అక్షరాలా మత ధర్మాన్ని పాటించాలంటే చాలా కష్టం. కష్టమైన మతాన్ని ఎవరూ ఇష్టపడరు. మారుతున్న ప్రపంచానికి అనుకూలంగా మతం కూడా కొన్ని చేర్పుల్ని ఒప్పుకోవడం మంచిదేమో!'

ఇస్లాం మతం మీద మోజు ఎందుకు పెరుగుతున్నది? ఇస్లాం మత ప్రచార సంబంధమైన కరపత్రాలు, సాహిత్యం బాగా అందుబాటులో వుంటున్నాయి. యూనివర్సిటీలో స్కాలర్‌షిప్పుల ద్వారా ఈ మతానికి మరింత ఆకర్షణ లభిస్తున్నది. అమెరికాలో అయితే ఈ మతం రాజకీయాల్తో ముడిపెట్టబడి వుంది. ఇంగ్లండులో కన్నా ఫ్రెంచి స్కాలర్‌షిప్పులు ప్రచారానికి బాగా సాయపడుతున్నాయి.

ముస్లిమ్‌లకంటె యూరోపియనులు ఈ మతం గురించి బాగా శ్రద్ధ చూపిస్తున్నారు— అన్నారు మవుల్వీ అబ్దుల్‌మజీద్. మహమ్మదు ప్రవక్త చరిత్ర ఎంతోమంది పాశ్చాత్య రచయితలు ఎంతో చక్కగా రాశారు. ఎన్నో భాషల్లో ఈ పుస్తకాలు వెలువడ్డాయి. తూర్పు దేశాల్లోనుంచి ఎప్పుడూ ఇన్ని భాషల్లో ఇన్ని పుస్తకాలు రాలేదు.

ఎక్కువగా సంచారం చెయ్యడంవల్ల కూడా మతప్రచారం జరుగుతుంది. ఈమధ్య అనేక దేశాల్లో ఇస్లాం మతస్థులు నివాసం ఏర్పరచుకొన్నారు. గ్రేట్ బ్రిటన్ ఒక్క దానిలోనూ ఇప్పుడు 50 మసీదులున్నాయి. గత పదిహేనేళ్లల్లోను 4000 మంది యు. కె. ప్రజలు ఈ మతాన్ని స్వీకరించారు.

ఇస్లాం మతంలోని వారితోనేకాకుండా ఇతర మతస్థులతోకూడా ఇస్లాం మతంపై ఉపన్యాసాలు ఇప్పించడం ఒక ఆచారంగా వుంది. వ్యక్తిగతంగా చెప్పాలంటే —, ఈ వ్యాసరచయిత కూడా అలాంటి ఉపన్యాసాలు ఇచ్చినవాడే!

ఇప్పుడిప్పుడు ఈ మత సంబంధమైన ప్రచారం మరీ విస్తరించబడుతున్నది. జనాన్ని బాగా ఆకర్షిస్తున్నది. క్రయిస్తవ మతంతో మళ్లీ ఎప్పుడో ఒకప్పుడు ఇస్లాం మతం పోటీకి రావొచ్చునవే భావం కూడా పొడసూపుతున్నది!

—హుసెయిన్ రోఫె. ●








జ రి గి న క థ

పార్వతికి అందమయిన రాజారావుతో పెండ్లవుతుంది. బొంబాయిలో వుంటున్న రాజారావు పార్వతిని కట్నంమీది మోజుతోనే చేసుకుంటాడు రిసెప్షన్‌కి వచ్చిన రాజాస్నేహితుడు మధుని పార్వతి నిరాడంబరత, సౌమ్యత బాగా ఆకర్షించాయి. మధు చెల్లి రేణుక. సంఘసేవంటే ఆమెకి చాలా ఇష్టం. నాయకురాలిలాంటి నాగమ్మ రాజా తల్లి. ఆమెకి కొడుకే ప్రాణం. కాపురానికి వెళ్లిన కొద్దిరోజులకే రాజారావు పైలావచ్చీసువాడని తెలిసి పార్వతి బాధపడుతుంది. భారతి పార్వతికి ధైర్యం చెప్పింది.

## 4

ఆ సాయంత్రం...రేణుక, మధు పార్వతిని చూడడానికి వెళ్లేసరికి ఎవరో కొత్తవాళ్లు కనిపించారు.

వీళ్లని చూడగానే పార్వతి నవ్వుతూ ఎదురొచ్చి 'రండి...మా అన్నయ్య, వదినా వచ్చారు' అంది.

'అలాగా! నమస్కారమండీ' అన్నారు రేణుక, మధు రామకృష్ణని భారతిని చూసి.

అన్నకీ, వదినకీ, వాళ్లిద్దరిని ప్రాణస్నేహితులుగా పరిచయం చేసింది పార్వతి.

రామకృష్ణకి, భారతికి మధు ఎంతో నచ్చాడు...

రేణుక కలుపుగోరుతనానికి ముచ్చటపడ్డారు. అందరూ కబుర్లు చెప్పుకుంటూ రాజారావుకోసం ఎదురు చూస్తున్నారు. నాగమ్మ ఇంట్లోలేదు.

పార్వతి సాన్నిధ్యంలో మధుకి మాటలే రావు...ఎప్పుడూ ఆరాధనే....

'మా పార్వతి చాలా అమాయకురాలు మధుబాబూ! ఎలా అయిపోయిందో చూశారా? ఆ కళ్ళు జీవంతో కళకళలాడేవి. ఎలా వుందో' హృదయంలోని ఆవేదనని ఇంక మాటల్లోకి మార్చకుండా వుండలేక పోయింది. అందులో మధుని, రేణుకని చూస్తుంటే ఇంక ఆపుకోలేక పోయింది. నాగమ్మ పెత్తనానికి వెళ్లింది కాబట్టి సరిపోయింది...లేకపోతే ఈ మాటలకి ఎంతగొడవ చేసునో ఆవిడ అనుకుంది పార్వతి.

'అత్తగారింట్లో వున్న ఆడపిల్లలు చిక్కినట్లే కనిపిస్తారు వదినా పుట్టింటివారికి' అంది పార్వతి.

'అయితే నువ్వు మునపటిలాగే వున్నానంటావు...అవునా?'

'ఆ...' అంది ధీమాగా పార్వతి.

'మా కళ్లకి నువ్వు చిక్కినట్లే కనిపిస్తున్నావు...దిగులుగా కనిపిస్తున్నావు...సుఖంగా లేవు...నిజం పార్వతీ! నీకేం తెలుస్తుంది నా బాధ. నువ్వెందుకిలా అయిపోయావు? మనిషి సన్నబడటమేకాదు...నీ మునుపటి ఉత్సాహమేదీ? ఒక్కటిమాత్రం నేర్చుకున్నావ్...నటన...'

'జీవితంలో నటన అవసరంకదూ వదినా?'

అంటూ నవ్వింది పార్వతి...వెంటనే గంభీరంగా మారిపోయింది...

'అయినా పెళ్ళయ్యాక చిన్నప్పటిలాగే ఉంటారా? చిలిపితనంగా, సరదాగా ఇప్పుడుంటే ఎవరు సహిస్తారు...బాగానూ వుండదు వదినా'

'ఏం? ఉత్సాహంగా, లేడిపిల్లలా చలాకీగా వుంటే తప్పా? భరింపరాని వేదన వుంటే తప్ప నీలా వుండరు. అయినా ఏమిటీ చేతకానితనం పార్వతీ?'

'నాకేమీ కష్టంగాలేదు వదినా' కళ్ళు నీళ్లతో నిండితే వెంటనే తుడిచేసుకుంది పార్వతి.

భారతి కళ్లల్లోనూ నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

'ఆత్మవంచన అన్నిటికన్న హేయం పార్వతిగారూ! జీవితంలో కష్టాలుంటాయి. కాదనరు ఎవరూ...కష్టాలనుండి మనం తప్పుకుందామన్నా అవి మన నెత్తిమీద కొచ్చి కూర్చుంటాయి. అది అందరూ ఒప్పుకుంటారు...కానీ, ఆ కష్టాలనుండి తప్పుకోడమెలాగా అని ఆలోచించాలి తెలివిగా ...అంతే మీ వదినగారు చెప్పేది కూడా...ఏమంటారు' అన్నాడు మధు భారతికేసి తిరిగి.

'అవును...నేనవేదీ అదే... ఆవులా సాధువుగా వుందామనుకుంటే ఎల్లాగ? ప్రపంచం నిండా తోడేళ్లు... నేనన్నది అర్థం చేసుకో పార్వతీ.'

'చేతకానితనం మంచిది కాదమ్మా... తెలీక నిన్ను ముళ్ళకంపలో పారేశాను... ఇది నా తెలివి తక్కువ' రామకృష్ణ బాధ అది.

'నో...నో... డాక్టర్! మీరలా బాధపడకూడదు ... మీకు ముందు తెలీదు కదా! మనిషి ధైర్యంగా పరిస్థితుల నెదుర్కోవాలి...కావలసింది గుండె ధైర్యం' అన్నాడు మధు పార్వతికేసి తిరిగి...

ఆ చూపు పార్వతి గుండెల్లోకి దూసుకు పోయింది.

వెయ్యి ఏనుగుల బలం వచ్చిందామెకి.

మరుక్షణ రాజా, నాగమ్మ గుర్తు వచ్చారు.

అంతే...పాతాళానికి కృంగిపోయింది.

'హీనత్వంలోకి దిగజారి పోతున్నావు పార్వతీ, ఆవు కూడా అంత సాధువై యుండి నాలుగు గోడల మధ్య బంధించి

కొడితే కొమ్ములతో పొడవడానికి వస్తోంది. అలాంటిది ఎలా భరిస్తున్నావు? ఇంత చేత కానిదానివై పోయావేమిటి?'

'అవును వదినా! అవును... నేనంతే ... నాకేమిటో భయం అంతే నాకెవరూ లేరు'

పార్వతి కళ్ళు వర్షించేస్తున్నాయి.

రామకృష్ణ కలగజేసుకుని 'ఎందుకు దాన్నలా వేధిస్తావు భారతీ! ఇది నా అప రాధం...మనమే చెయ్యాలి ఏదైనా చేస్తే...' అన్నాడు.

'వద్దన్నయ్యా వద్దు...ఎవ్వరూ ఏమీ చెయ్యక్కరలేదు. నేనే అనుభవిస్తాను...ఇది నా ఖర్మ...ఇలాగే కృంగి కృశించి, నశించి పోతాను'

పార్వతి ఎంత నిగ్రహించుకుందామను కున్నా ఆగటంలేదు ఆ కన్నీటిధార...

అంతవరకు పార్వతి ప్రక్కనే మౌనంగా కూర్చునేవున్న రేణుక గబుక్కున పార్వతిని తనవైపు లాక్కుని 'పార్వతీ! అలా ఏడ్వదు ...నువ్వు నా ప్రాణం...నిన్ను చూస్తూ చూస్తూ నశింపచేస్తానా? కాదు...ఇంత మందిమి వుండి ఏం చెయ్యలేమా?' అంది.

'ఏమీ చెయ్యలేరు రేణూ! ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. భగవంతుడుతప్ప ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు...'

వీధిలో గలగలమని సందడి...

నాగమ్మ ... రాజారావు ... మాట్లాడు కుంటూ లోపలకు వచ్చారు...గబగబ కళ్ళు తుడిచేసుకుంది పార్వతి.

'హలో...మధూ! ఏమిటి? ఎప్పు డొచ్చారు?'

అన్నాడు రాజా మధు పక్కనే కూర్చుంటూ. నవ్వుతూ రేణుకని కూడా పలకరించాడు.

'మీ బావగారు వచ్చారని చెప్పలేదేం రాజారావుగారూ పొద్దున్న కలసినప్పుడు?' మధు అడిగాడు.

'మరిచానండీ' అంటూ మధుకి సమా ధానం చెప్పి ఇంక బావుండదనుకుని రామ కృష్ణతో మాట కలిపాడు రాజా.

'ఏమండీ బావగారూ? ప్రాక్టీసు ఎలా సాగుతోంది.'

'బాగానే వుంది' అది రామకృష్ణ సమాధానం.

పిచ్చాపాటీ కబుర్లతో కాలక్షేపం అతి మెల్లగా జరుగుతోంది. మధు మాట్లాడు తూనే ఆలోచిస్తున్నాడు.

పార్వతి అన్నగారినీ, వదనగారిని భోజ నానికి పిలుద్దామని నిశ్చయించుకున్నా డతను.

'రాజారావుగారూ! మీ బావగారూ వాళ్ళూ వచ్చారు కాబట్టి ఈరోజు నేను విందు ఏర్పాటు చేద్దామనుకుంటున్నాను. అందరం కలిసిగా కులాసాగా భోంచేద్దాం' అన్నాడు మధు అందరివైపూ చూసి.

'ఓ, అలాగే ... నేను రెడీ, అమ్మా,



మన మధుబాబు డిన్నర్‌కి పిలిచారు ... నువ్వు రెడీ అవు' అంటూ లోపలికి కేకేశాడు రాజా.

రామకృష్ణ ఆశ్చర్యపోయాడు.

ఇంటికి అతిధులొస్తే తాను ఆతిధ్య మివ్వాల్సిందిపోయి మధు పిలవగానే అందరూ తయారవుతున్నారు.

ఏం బావుంటుంది? అదే విషయం భారతీ ఆలోచిస్తోంది. కానీ రేణుక, మధుని కష్టపెట్టడం వాళ్ళకి ఇష్టం లేకపోయింది. పార్వతికీ మనసు కాస్త స్థిమితపడింది.

ఆ రాత్రి వారు మధుసూదన్ ఇంట్లోనే వుండిపోయారు.

* * *

మద్రాసులో పదిరోజులుండి రావచ్చు రమ్మని రామకృష్ణ భారతీ ఎంత బతి మాలినా రానంది పార్వతి.

వెళ్ళేటప్పుడు పార్వతికి అయిదువందలు చేతికిచ్చి మరో వందరూపాయలకి టానిక్కులు, మందులు కొనిచ్చాడు రామకృష్ణ.

రాజారావుకి వెయ్యిరూపాయలిచ్చాడు... మొహమాట పడినట్లు ముందు వద్దని తరువాత తీసికొన్నాడు.

'ప్రస్తుతానికి రేడియో కొనుక్కోండి... ఇంటికెళ్ళాక మరో రెండువేలు పంపు తాను... ఫ్రిజ్ కొనుక్కోండి బావగారూ! స్కూటరు సంగతి మరోసారి ఆలోచిద్దాం' అన్నాడు రామకృష్ణ రాజాతో.

చేతనున్న వెయ్యిరూపాయలు చూసే టప్పటికి రాజా ఒళ్ళు మరచిపోయాడు... ఇంకా రెండువేలు వస్తాయి వెర్రి ఆనంద్కం

# డిసిఎమ్ టెక్స్‌టైల్ డిజైన్ యూనిట్ వద్ద ఎంతో ఆశ్చర్యకరమైన విషయములు జరుగుతున్నాయి.

వాటిని మీరు చూసిన వెంటనే ఆశ్చర్యచకితులవుతారు. ముచ్చటతో మురిపించే రమణీయమైన రంగు రంగుల దృశ్యములు. కళ్లకు మిరుమిట్లు గొలిపే నవ్యమైన రక్తి. గగుర్పాటు కలిగించే, అందమైన నేతగల బట్టలు. అవి ఎంతో మనోహరమైనవి! డిసిఎమ్ త్వరిత వేగంతో ఈ దశాబ్దములో ముందుకు పోతోంది! అది అందరి కన్నా ముందర వుంచే వేగము!

డిసిఎమ్ జాకర్డ్, లూప్ మరియు టర్కిష్ తువ్వాళ్లు. హ్యాండ్ టవెల్స్, ముఖము తుడుచుకునేందుకు తువ్వాళ్లు, స్నానపు తువ్వాళ్లు, స్నానమునకు కట్టుకునే తువ్వాళ్లు, బీచ్ మీద కట్టుకునే తువ్వాళ్లు. మెత్తగా హాయిగా వుంటాయి.



డిసిఎమ్
టెక్స్‌టైల్స్

mcm/dcm/92 tel

[illegible] రాజా. [illegible] అత్త చూచి మళ్ళీ తన పనిలో నిమగ్ను రాలైంది పార్వతి.

'ఏం? నీదగ్గర డబ్బు లేదూ!

'ఉంది' అంది పార్వతి.

'ఇలా ఇచ్చెయ్. బొత్తిగా చేతిలో పైసా లేదు' విలాసంగా చేతిలో తాళం చెవులు తిప్పుతూ అన్నాడు రాజారావు.

'అదేమిటి? మొన్ననేగా అన్నయ్య వెయ్యి రూపాయలిచ్చాడు. అదీకాక నా దగ్గర నాలు గొందలు పుచ్చుకున్నారు...'

# ముగింపు...

మాట పూర్తి కానేలేదు.

'అయితే ఏం? ఖర్చంతా రాసి నీకు చెప్పాలా? ముందు ఇచ్చెయ్ ఆ వందా.'

'ఊహూ...నాకు కావాలి'

'నీకెందుకు?'

'అసలు చీరల్లేవు ... కొనుక్కోవాలి...'

'చీరలెందుకు లేవు ? బీరువానిండా వున్నాయి. ఇప్పుడసలు నీకు చీరలెందుకు ? ఇంట్లో వుండేదానికి...తీసుకురా ఆ వంద.'




పార్వతి ఇచ్చే [illegible] లేదు.

రాజారావుకి ఒళ్ళు మండుకుపోతోంది.

'ఛే. రాణీ...డబ్బు తే ... నువ్వు ఇవ్వక పోతే బలవంతంగా నీ పెట్టె తెరిచి తీసుకో వలసి వస్తుంది.'

'ఇవ్వవమ్మా రాణమ్మా! వాడంత అడుగు తుంటే నీక్కాదూ! వాడసలే మొండివాడు. ఇంకా నయం మావాడింకా మెల్లిగా అడుగు తున్నాడు. మరొకరయితే తన్ని తీసు కుందురు. ఇచ్చెయ్ వాడికి డబ్బు' అత్త గారు వత్తాసు పలికింది.

'ఏమిటీ దౌర్జన్యం' అనుకుంది పార్వతి.

కళ్లనీళ్లు గిర్రున తిరిగాయి. వంద రూపాయల నోటు రాజారావు హస్తగతం అయింది. ఆ నోటు పార్వతి చేతులోంచి లాక్కుని ఒక విషపునవ్వు ఆవిడ మీద విసిరాడు. నవ్వుతూ దుస్తులు మార్చుకో సాగాడు...హుషారుగో కలపాట ... పార్వతి మనసు పరిపరివిధాల పోతుంది.

ఏమిటీ దారుణం? ఒక్కవారంలో వెయ్యిరూపాయల నాలుగొందలు ఖర్చు ? అదేమిటని అడగకూడదా ? తనకేమీ ఖర్చు లుండవా ? ఎక్కడికీ అడుగుదాం? అను కుంది పార్వతి.

'అంతడబ్బు మీరే తీసుకుంటే ఎలా ? నా ఖర్చులకి ...'

'ఏమిటీ ? నీకు ఖర్చులా ? మీ అన్న య్యకో ఉత్తరం రాసి ఇమ్మని ... ఎన్నివేలేనా పంపుతాడు'

మరోసారి వికటంగా నవ్వుతూ పార్వతిని తోసుకుంటూ వంటగదిలోకి పోయాడు 'అమ్మా ... అమ్మా' అని పిలుచుకుంటూ.

'ఏమిట్రా బాబులూ!' అంది నాగమ్మ ప్రేమగా. ప్రేమ మరీ ఎక్కువయితే బాబులూ అంటుం దావిడ.

'ఏమ్మా' నీకేమైనా కావాలా బజారు నుంచి' దగ్గరగావెళ్ళి వీపుమీద చెయ్యేసి అడిగాడు.

'ఏం వద్దురా వెర్రినాన్నా. నీ సుఖమే నా క్కావలసింది.' బుగ్గలు తడిమి ముద్దెట్టు కుంది.

పార్వతికళ్ళు నీటితో నిండాయి. గుమ్మంలో నుంచున్న పార్వతిని చూపిస్తూ అన్నాడు రాజా.

'[illegible] [illegible] [illegible] [illegible]

[illegible]'

వుందో. నీ దగ్గర వున్నానని' తమాషినవ్వు.

చిరుక్కున అక్కడనుండి తన గదిలోకి వెళ్ళిపోయింది పార్వతి. రాజా గట్టిగా నవ్వాడు. ఆ నవ్వు వినలేక చెవులు గట్టిగా మూసుకుని పక్కమీద వాలిపోయింది.

'మాట్లాడితే వస్తుంది ఏడుపు ... సరే...ఇంక వెడతావమ్మా' వెళ్ళిపోయాడు రాజా కోలాదగ్గరకి.

'ఏమే రాణమ్మా తలుపేసుకో వక్కింటికి వెడుతున్నా' అని వెళ్ళిపోయింది నాగమ్మ.

'రాణమ్మా' అన్న పిలుపు చాలు తనని ఖూనీచెయ్యడానికి అనుకుంది పార్వతి. తన బ్రతుకుని తలుచుకుని కుళ్ళి కుళ్ళి ఏడిచింది పార్వతి. ఎంత నికృష్టపు బ్రతుకు. తను ఏకాకి! ఎవరూ తోడూ, నీడాలేని ఒంటరి...భగవాన్! ఈ జీవితానికి అంతం ఎప్పుడు ? అని దేవుణ్ణి పదే పదే ప్రశ్నించింది ?

* * *

పదిరోజులు ఇంటికే రాలేదు రాజారావు. ఇది మామూలే. పార్వతికి అలవాటయిపోయింది. ఇదంతా ఆ కోలా మోజు అనే ఆవిడ ఉద్దేశం. కోలాని గురించి ఆలోచిస్తోంది పార్వతి.

కోలా ఎంత అందంగా చలాకీగా వుంది! ఎంత బాగా అలంకరించుకుంది! ఆధునిక యువతి, తళుకు బెళుకులు తెలిసిన వయ్యారి కోలా! మరి తనో! ఏ అలంకరణలూ లేక నిరాడంబరంగా, అతి సామాన్యంగా సంసార పక్షంగా వుంటుంది. అందుకే రాజా కోలావెంట పోతాడు. అందులో ఆశ్చర్యమేం కనబడలేదు పార్వతికి.

మొన్న వచ్చినప్పుడు కోలా చిన్ని కబుర్లు కళకళ చెప్పేసింది.

'మీరెంత అందంగా వున్నారు ? మీరూ రాకూడదూ క్లబ్‌కి ?' అడిగింది పార్వతిని మాటల సందర్భంలో. గదిలో కూర్చుని పవుడర్ మొహానికి రాసుకుంటున్న రాజా గట్టిగా నవ్వాడారోజు.

'మా రాణి క్లబ్ కొస్తే నిన్ను మించి పోతుంది కోలా!' అన్నాడు.

'సరే లెండి. నేను కాదన్నానా?' అంది కోలా మూతి సన్నగా తిప్పుతూ.

నవ్వేసింది పార్వతి.

'మీరు నవ్వితే బావుంటారు ఇంకా... రాజా వెళ్ళేది మీతో ... మీరు రాకండి బాబూ క్లబ్‌కి' అంది కోలా చిలిపిగా కనుసైగచేసి.

'నేను రాను లెండి. భయపడకండి' అంది పార్వతి మళ్ళీ నవ్వుతూ.

'థాంక్స్ స్వీట్!'

తరువాత వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

ఆ సంఘటన గుర్తుకొచ్చి సన్నగా నవ్వుకుంది పార్వతి.

ఆ నవ్వు రాజా [illegible] కోలాకి నచ్చడమా? ఎంత తమాషా! తనూ, తన బ్రతుకూ, తనకో నవ్వూ! [illegible] విరక్తి కలిగింది!

ఉదయం తొమ్మిదిమ్ముప్పావు. నాగమ్మ వంటింట్లో భోంచేస్తోంది. పార్వతి పుస్తకం తెరిచి ఒడిలో పెట్టుకుని ఆలోచిస్తోంది. తలుపుకొట్టిన చప్పుడు. తలుపు

## ముగింపు...

తీసింది పార్వతి. ఎదురుగా రేణుక. పార్వతి మొహం వెలిగింది.

'రేణూ! నువ్వా! అయిపోయిందా నీ సంఘసేవ?'

రేణుక సంఘసేవ అంటూ పక్కనే వున్న వల్లెకి వెళ్ళింది.

'అయింది పార్వతీ! నిన్ననే వచ్చేశాను. నిన్నంతా విశ్రాంతి. ఈరోజు ఏం తోచక నీ సేవ చేద్దామని వచ్చాను.' అంది రేణుక నవ్వుతూ లోపలికి వచ్చి కుర్చీలో కూర్చుంటూ.

'చాల్లే! కబుర్లు బాగానే చెప్తావు.'

'ఏమిటే? ఎవ్వరూ లేరా ఇంట్లో?' ఎవరూ మీద వత్తి పలుకుతూ.

'లేకేం? అత్తగారు భోంచేస్తున్నారు.'

'అయితే నీ భోజనం అయిందన్న మాట ... నీ మొహం చూస్తే తిన్నట్లు లేదు... పద పార్వతీ. త్వరగా తయారవు. షికారెళ్దాం. సరదాగా అలా మలబార్‌హిల్స్ వైపు' అంది రేణుక.

అప్పుడే నాగమ్మ భోంచేసి ఇవతలకి వచ్చింది.

'ఎవరూ వచ్చింది. నువ్వా. ఏమిటమ్మాయ్ సంగతులు?' అని రేణుకతో మాట్లాడుతూ పార్వతివైపుతిరిగి 'నువ్వెళ్ళి భోంచెయ్' అంది.

'ఏమిటే నీ భోజనం కాలేదూ ఇంకా' అంది రేణుక.

'ఎలా తింటుందమ్మాయ్! మా ఇళ్ళల్లో మొగుడూ అత్తగారూ తిన్న తర్వాత కోడళ్ళు తినాలి. నువ్వింకా చిన్నపిల్లవి తెలీదు నీకు. ఇంకా నేను చాలా మంచిదాన్ని. మా కాలంలో అసలు అత్తగారు మాట్లాడుతుంటె మే మిలా నుంచునే వాళ్ళమా?..' ఆ ధోరణి అలాసాగేదే. రేణుక ఆపు చేసింది.

'మా ఇళ్ళల్లో వద్దతే వేరులెండి. చిన్నవాళ్ళకి ముందు పెట్టి తర్వాత పెద్దవాళ్ళు తింటారు.'

నాగమ్మ సణుక్కుంది.

'నువ్వు భోంచేశావా రేణూ!'

'లేదు పార్వతీ! ఇప్పుడు పదయింది. ఈవేళప్పుడు భోజనమేమిటి? టిఫిన్ తిన్నాను. నువ్వు త్వరగా రా'

'వంటిల్లు సర్దివస్తా.'

లోపలికి పోతున్న పార్వతిని ఆపుచేసింది నాగమ్మ.

'ఏమిటే! ఎక్కడికన్నా వెళ్తున్నారా?'

'అవునండీ. ఇప్పుడేమీ పనిలేదుగా పార్వతికి. నాకూ ఏం తోచటంలేదు. అలా వెడదామని అనుకుంటున్నాను.'

'మా అబ్బాయి ఇంట్లో లేడమ్మా. కేంప్ కెళ్ళాడు. అడిగి వెళ్ళకపోతే వాడికి కోపం వస్తుంది.'

పార్వతికి వొళ్ళు మండిపోయింది.

'కేంప్ కెళ్ళినట్లు మీకు తెలుసా?' అంది పార్వతి.

'ఆ...నా కెందుకు తెలీదూ? నాకు తెలీకుండా ఏదీ చెయ్యడు నా బిడ్డ. నువ్వు ఆ రాత్రి నిద్రపోతున్నావు. వచ్చాడు. కేంప్ కెళ్ళాలంటే తోలు పెట్టి కూడా సర్ది పెట్టాను. వెళ్ళిపోయాడు అప్పుడే ... నువ్వెక్కడ? మొగుడు రాకముందే మంచమెక్కుతావు' సాధించింది నాగమ్మ.

'అయితే ఇన్ని రోజులనుండీ నే నడుగుతుంటే చెప్పరేం ఈ సంగతి? నా కెందుకు చెప్పలేదు మీరు?'

'నీకెందుకు చెప్పాలి? అన్నీ నీకు చెప్పాలా? ఎంత పెళ్ళానివైనా, నా తర్వాతే నువ్వు. మర్యాదగా నోరుమూసుకు పడుండు. అంతే' అంది నాగమ్మ విసురుగా.

రేణుక పార్వతినే తదేకంగా చూస్తోంది. ఫర్వాలేదు. ఆ మాత్రం అత్తగారితో ఘర్షణపడిందే అనుకుంది.

ఏం మాట్లాడకుండా పార్వతి వంటింట్లోకివెళ్ళి గిన్నెలన్నీ సర్దింది. భోంచెయ్యాలనిపించలేదు. కాస్త సేపటికి ముస్తాబయి వచ్చింది.

'ఏమిటి రాణీ? వెళ్తున్నావా? మళ్ళీ వాడొచ్చి గొడవచేస్తాడు. చెప్పకుండా ఎలా వెడతావు?'

'ఎప్పుడొస్తా రాయన?' అడిగింది పార్వతి.

'మధ్యాహ్నం వచ్చేస్తాడు. అవతలికి ఆఫీసుకి వచ్చివుండాలి.'

'మధ్యాహ్నంలోపల వచ్చేస్తాను' అంటూ హేండ్‌బాగ్ పుచ్చుకుని బయటకు నడిచింది. ఆ హేండ్‌బాగ్‌లో పదిరూపాయలు కొంత చిల్లర వుంది, అంతే! మిగిలినదంతా రాజారావు తీసుకున్నాడు.

నాగమ్మ వింతగా చూస్తూండిపోయింది పార్వతి, రేణుక వెళ్ళిపోతూంటే!

(ఇంకా ఉంది)

# వారఫలం

**4-6-1971 శుక్రవారం మొదలు**
**10-6-1971 గురువారం వరకు**

**మేషం :** ప్రయత్నించిన ప్రతిపని సఫలంగా నెరవేరగలదు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. పోటివారిలో గౌరవం బాగుంటుంది. వారంమధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**వృషభం :** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన సందేహాలు కలుగుతాయి. పోటివారితో మాట పట్టింపులు తగవు. వారం మధ్యలో భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మిథునం :** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారంమధ్యలో వృత్తిలో పోటివారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడుతాయి.

స్త్రీలకు—సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. దైవకార్యాలు నెరవేరతాయి

**కర్కాటకం :** సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వారంమధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు... వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారంమధ్యలో ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు—విలాస వస్తువులు కొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**కన్య :** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల :** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్టుగా నెరవేరతాయి. పోటివారిలో గౌరవం లభిస్తుంది విలాస వస్తువులు కొంటారు. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**వృశ్చికం :** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమకు గురికాగలరు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో చికాకులు కలుగుతాయి. వారంమధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు లాభించగలవు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.. మిత్రుల సహాయం లభిస్తుంది. వారంమధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు.

స్త్రీలకు—అధికవ్యయం జరుగుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం :** అన్ని వ్యవహారాల్లోను [illegible] స్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**కుంభం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మీనం :** కొన్ని వ్యవహారాల్లో మీరు వెనుకకు తగ్గడమే మంచిది కాగలదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆందోళన కలుగుతుంది. వారంమధ్యలో వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.





# శ్రీవారితో పుట్టింటికి

కంచి విశాలాక్షి

నాన్నగారు వుత్తరం వ్రాశారు — సంక్రాంతి పండుగకు రమ్మని—

మా పెళ్లిఅయిన తర్వాత మొదటి సంక్రాంతి యిది—

ఇప్పుడు పుట్టింటికి వెళ్లడమంటే కొత్త హోదాతో, కొత్త గౌరవ సత్కారాలు పొందడానికి వెళ్లడమన్నమాట—

శ్రీవారు నాకన్నా ఎక్కువ వుబలాట పడుతున్నారు—మామగారింటికి వెళ్లి ఆయన యిచ్చే కానుకలు స్వీకరించాలని—

ఇద్దరమూ కలసి రేపు భోగి అనగా బయలుదేరి భోగినాడు గమ్మస్నానం చేరాలని శ్రీవారు నిర్ణయించిన కార్యక్రమం— రెండురోజులు ముందే బయలుదేరే కారణమే కాని, శ్రీవారి 'శ్రీవారు' సెలవు ఒక పట్టాన మంజూరు చేయలేదు — ఆ 'శ్రీవారి'ని ఈ శ్రీవారు ప్రసన్నుని చేసుకోవడానికి, యీయనెన్నిపాట్లు పడిందీ, ఆయనను చివరకు ఎల్లా మంచి మూడులో పెట్టిందీ, ఆయన విసిరే 'విట్సు'కు ఎల్లా నవ్విందీ, చివరకు ఎల్లా 'సెలవు' సంపాదించిందీ, మావారు నవరస భరితంగా వర్ణించి చెపుతుంటే, 'ఏమిటో అనుకున్నానూ?— శ్రీవారు అఖండులన్నమాట' అని ముక్కుమీద వేలేసుకున్నాను.

రాత్రి తొమ్మిదిగంటలకు మా వూరు వస్తుంది, మమ్మల్ని తీసుకుపోయే రైలు — వచ్చినరైలు రెండు నిముషాలయినా వట్టుమని ఆగక కొంప మునుగుకు పోయినట్టు వెళ్లిపోతుంది — మా వూరిలో ఆ రైలు ఎక్కేవారూ దిగేవారూ ఎక్కువే ఐనా ఆ రైలు మరో రెండు నిముషాలు ఆగదు—'రూల్సు' లేవుట—

'అటువంటి రెండు నిముషాలలో ఆ రైలు మనం ఎక్కగలమా?'— అని నేనంటే శ్రీవారు ఒక చిరునవ్వు విసరి 'యూ సిల్లీ గర్ల్ నేనుండగా నీకు భయమేల'—అంటూ ఆయన యూనివర్సిటీలో చదువుకునే రోజులలో, ఆయన ఎంతెంతటి సాహస ప్రయాణాలు చేసేవారో, కిటికీలోంచి అమాంతం ఎల్లా దూసుకుపోయేవారో, అంతెందుకు కొత్తగా తెలుగుసినిమా రిలీజయితే మొదటిరోజున ఎల్లా జనం నెత్తిమీద నుంచి నడుచుకుంటూ వెళ్లి టిక్కెట్లు సంపాదించేవారో వర్ణిస్తూవుంటే 'ఇంక నాకేం భయము' అనుకున్నాను.

* * *

'ఇంకా తెమల్లేదా?' శ్రీవారు హుంకరించారు.

'ఐపోయింది — జస్ట్ ఫైవ్ మినిట్సు ప్లీజ్'— అన్నాను.

'అల్లాగే గంటనుంచి అంటున్నావు. రిక్షావచ్చి అరగంటయింది'— శ్రీవారు విసుక్కుంటున్నారు.

ఏ మాటకు ఆమాటే చెప్పుకోవాలి — శ్రీవారు చిరాకూ కోపం వచ్చినప్పుడు—నాకు మరీ అందంగా కన్పిస్తారు. అందుకనే అప్పుడప్పుడు ఆయనకు చిరాకు తెప్పించడమంటే నాకు చాలా సరదా. ఐతే యిప్పుడుమటుకు ఆయనకు బుద్ధిపూర్వకంగా చిరాకు తెప్పించలేదు. చీరకూ బ్లౌజుకూ మ్యాచి అవడం లేదు—అందుకనీ ఈ ఆలస్యం.

ఇంకా ఆలస్యంచేస్తే బాగుండదని ఏదో రెడ్ కేప్ సిల్కుచీర, దానిమీద డీప్ బ్లూ బ్లౌజు వేసుకున్నాను.

నన్ను చూడగానే శ్రీవారి ముఖంలో 'చిరాకు' మాయమయింది— 'ఎక్సలెంటు— వండర్‌ఫుల్—వాటెబ్యూటీ' అన్నారు. నిజం చెప్పొద్దూ నేనూ చాలా పొంగిపోయాను.

* * *

రిక్షా బయలుదేరింది.

'ఎంతో మాట్లాడారా?' — నెమ్మదిగా అడిగాను.

'హుష్ వూరుకో! ఎంతయివ్వాలో నాకు తెలుసులే' అన్నారు శ్రీవారు.

మున్సిపాలిటీ దీపాలు రోడ్డుమీద మస

కగా వెలుగుతున్నాయి. కొన్ని స్తంభాలకు బల్బులే లేవు. రోడ్డంతా చీకటి. రిక్షాలో చీకటి—

శ్రీవారు కొంటెవారు—చెయ్యివొక్కుతూ వెనకనుంచి చెయ్యి పోనిచ్చి చక్కిలిగింతలు పెడుతూ వున్నారు—

'వూరుకోండి' అన్నాను నెమ్మదిగా అయినా ఆయనకు వినిపించేట్టు.

శ్రీవారు మరింత గట్టిగా చెయ్యి వొక్కారు.

* * *

స్టేషను వచ్చింది - రిక్షాదిగాం—శ్రీవారు చక్కటి పోజుయిచ్చి పర్సులోంచి ఒక అర్ధ రూపాయితీసి రిక్షావాడికి యిచ్చారు.

రిక్షావాడు ఎగాదిగా ఆ అర్ధరూపాయి వంక చూశాడు—'ఏమిసార్! ఎంత యిస్తున్నారు?' అన్నాడు.

'కన్పించడం లేదా! అర్ధ రూపాయి అంటే ఏభయి పైసలు'—వెటకారంగా శ్రీవారు అన్నారు.

ఆ వెటకారం రిక్షావాడికి గుచ్చుకుంది — 'ఏమిటయ్యా — అర్ధరూపాయి ముష్టిగా యిస్తున్నారా...ఎక్కడ శివాలయం ఎక్కడి రైల్వేస్టేషన్ — పైగా యింటి దగ్గర గంట నుంచోపెట్టిరి?'— అంటున్నాడు.

రిక్షావాడి ఏకవచనప్రయోగం శ్రీవారికి కోపం తెప్పించింది—అయినా దిగమింగుకుంటూ 'అయితే ఏం యిమ్మంటావు...ఐదు రూపాయలు యిమ్మంటావా? పది రూపాయలు యిమ్మంటావా?' అన్నారు—

'ఐదులూ పదులూ మాకు దేనికిసార్—న్యాయంగా యివ్వవలసింది ఇవ్వండి' అన్నాడు.

'ఇంతకీ ఎంత యిమ్మంటావు?' శ్రీవారు అన్నారు, విసుగ్గా...

'నేను చెప్పేదేముంది సార్— మీకు తెలియదా రూపాయిన్నరకి తక్కువ పుచ్చుకోము'

ఇంతలో చుట్టుపక్కల రిక్షాల వాళ్ళు మూగారు చోద్యంచూస్తూ.

'ముందుగా మాట్లాడుకోక పోవడం మాదే తప్పు— అక్కడ అడిగితే మీదయ అనడం తీరా యిక్కడకి వచ్చేటప్పటికి తెగ నీలగడం—ఈ రిక్షావాళ్ళకివున్న మాయ రోగమిదే' శ్రీవారు కోపంగా అన్నారు—

రిక్షావాడికి కోపంవచ్చింది 'ఏమయ్యోయ్ మాటలు జాగ్రత్తగా రానీ... నీలుగుడూ—గీలుగుడూ అంటే బాగోదు—మాకేమయినా నోళ్ళే యున్నావా...',

# శ్రీవారితో పట్టింటికి

రైలు వచ్చేట్టైమయింది— వాడి కోపం చూచి శ్రీవారూ వెనక్కు తగ్గారు.

'ఏదోయిచ్చి పంపేయండి—మనకు రైలు వచ్చేట్టైమయింది' అన్నాను.

ఏమయితేనేం తక్కిన రిక్షావాళ్ళ మధ్య వర్తిత్వంవలన యింకో అర్ధరూపాయి యిచ్చి స్టేషనులోకి అడుగుపెట్టాం—

'ఛీ! ఈ ఆడవాళ్లతో ప్రయాణం పెట్టుకోకూడదు— ఒకపట్టాన తెములరే... అరగంటసేపా రిక్షాను నిలపడం—అందు కనే వాడు తెగనీలిగాడు'—శ్రీవారు తప్పంతా నా నెత్తిన రుద్దుతున్నారు.

రిక్షా రాగానే నేను రిక్షా ఎక్కివుంటే 'వాడు పావులాకే వచ్చేవాడని శ్రీవారి వుద్దేశమేమో మరి—

బుకింగ్ కిటికీముందు పెద్ద జన సమూహంవుంది—ఇంకా టిక్కెట్లు యిస్తు న్నట్లు లేదు—బండి రావడానికి పావుగంట వ్యవధి వుంది—

'శ్రీవారు ఎల్లా టిక్కెట్లు తీసుకు రాగలరు?' అని ఆలోచిస్తున్నాను. శ్రీవారు ఆలనాడు అభిమన్యుడు పద్మవ్యూహంలో ప్రవేశించినట్లు ప్రవేశించి టిక్కెట్లు సంపాదించాలనీ నాముందు తన 'విక్ర మాన్ని' ప్రదర్శించాలనీ మహా ఆరాట పడుతున్నారు.

నాకు బెంగ ఎక్కువయింది—టిక్కెట్లు దొరకుతాయా అని.

ఫస్టుబెల్లు కొట్టేశారు—కిటికీముందు త్రొక్కిడి ఎక్కువయింది — ఆ త్రొక్కి డిలో నిలువలేక శ్రీవారు బయటపడ్డారు. ఏంచేద్దామన్నట్లు దగ్గరోన్న నావంక చూశారు. నాకు మరీ బెంగపెట్టుకుంది. ఆయనను చూస్తే జాలి! శ్రీవారి మనో భావాలు ఎల్లా వున్నాయో నేను వూహించనే లేకపోతున్నాను—శ్రీవారి ముఖంలో కంగారు మటుకు కన్పిస్తూనే వుంది.

ఏం చేద్దామురా భగవంతుడా అను కుంటూ వుండగా నల్లనివాడు—ముఖమున నామములవాడు 'ఒకాయన ప్రత్యక్ష మయ్యాడు—

'సార్ ఏవూరు వెళ్తున్నారు?' నామాల వాడు ప్రశ్నించాడు.

'బందరు' శ్రీవారి సమాధానం—

'సెకండు బెల్లుకూడా కొడుతున్నారు సార్ మీకు టిక్కెట్టు దొరకదు' అన్నాడు.

'అవును అదే ఆలోచిస్తున్నాను'—శ్రీవారు—

'పాపం! ఫేమిలీతో వెళ్తున్నట్లున్నట్లు న్నారు సార్—పండుగకు వెళ్తున్నారా?'

తాపీగా నామాలువాడు ప్రశ్నిస్తుంటే శ్రీవారికి చిరాకు ఎక్కువయింది. ఆయన చిటపటలాడుతూ చూశాడు.

'మీకు అభ్యంతరం లేకపోతే నేను టిక్కెట్లు తెచ్చియిస్తా సార్ బుకింగ్ క్లర్కు మనవాడే' అన్నాడు నామాలవాడు—

కొండంత బరువుదించినట్లు శ్రీవారు ఫీలయ్యారు—

గబుక్కున రెండు పదులు చేతిలో పెట్టి, బందరుకు రెండు టిక్కెట్లన్నారు—నామాలవాడు వెళ్ళాడు—

'అయ్యో తెలివితక్కువా— శ్రీవారు ముందు ఆలోచనలేకుండా ముక్కూ మొహం తెలియని వాడికి డబ్బు యిచ్చారు— వాడటే

కూసుకుపోడని నమ్మక మేమిటి?'

ఈమాట అంటుంటే శ్రీవారు నాలిక కరచుకున్నాడు—'ఛా ఆ ఏడుపు ముందే ఏడ్వలేకపోయావు'— అంటూ నన్ను విసుక్కున్నారు - శ్రీవారు చిరాకు పడ్డప్పుడు నాకు సరదాగానే వుంటుంది కాని ఆయిన దానికీ కాని దానికీ నామీద చిరాకుపడడంతో నాకూ చిర్రెత్తింది.

'మధ్య నామీద విరచుకు పడ్తారేమిటి? బాగానే వుంది వాలకం'—అన్నాను. శ్రీవారు పళ్ళు పట పటలాడించారు. సెకండ్ బెల్లు కొట్టారు.

నాకు కన్నీళ్ల పర్యంత మయింది శ్రీవారు జుట్టు పీక్కుంటున్నారు—

'ఇంతలో నామాలవాడు ప్రత్యక్ష మయ్యాడు—ఇవిగోసార్ రెండుటిక్కెట్లు—చిల్లర లెక్కచూచుకోండి' అన్నాడు—రైలు వస్తున్న చప్పుడవుతోంది—

శ్రీవారు టిక్కెట్లు చిల్లరజేబులో పెట్టుకుని 'చాలా థ్యాంక్సు' అన్నారు—

'సార్ కాఫీడబ్బులు దయచేయండి' అన్నాడు — శ్రీవారు ఒక రూపాయి చేతిలో పెట్టారు—

నామాలవాడు నమస్కరించి వెళ్ళిపోయాడు. మేము ప్లాటుఫారం మీద చేరడమూ రైలురావడమూ ఒక్కసారే జరిగాయి—

ప్రతి పెట్టెనిండా జనం కిటకిటలాడి పోతున్నారు— ఏ కంపార్టుమెంటు దగ్గరకు వెళ్ళినా ఖాళీ లేదు. పక్క పెట్టెలోకి వెళ్లండి, అంటున్నారు—

గార్డు విజిలు వూదాడు—మేమింకా ప్లాటుఫారం మీదేవున్నా—శ్రీవారు కంపార్టుమెంటులోకి వెళ్లేందుకు ప్రయత్నిస్తున్నారు—లోపలివాళ్లు రానివ్వడం లేదు. శ్రీవారు ఇంగ్లీషులో గట్టిగా అరుస్తున్నా లాభం లేకపోతుంది—

'అయ్యా! ఎల్లాగో అల్లాగో సర్దుకుంటాం—గార్డు విజిలు వూదాడు—ఎక్కనివ్వండి' — అన్నాను — కొంచెం ఏడ్పు కంఠంతో—

'నా మాటలు పనిచేశాయి. ఎక్కనివ్వవయ్యా— యిప్పుడు ఎక్కడికి వెళ్తారు' అని పెట్టెలో వాళ్లు కొందరు అన్నారు. ఎల్లాగయితేనేం శ్రీవారు నేనుకంపార్టుమెంటులోకి ప్రవేశించాం — రైలు కదిలింది—అమ్మయ్యా 'అంటూ నిట్టూర్చాము—

కంపార్టుమెంటులో కూర్చునే బల్లల మీద కొందరు పడుకుని నిద్రపోతున్నారు—వాళ్ళు లేస్తే కూర్చోవచ్చు—

శ్రీవారు నిద్రపోతున్నట్లు కళ్ళు మూసుకుని పడుకున్న వాణ్ని లేపారు—వాడు కళ్ళు తెరచి శ్రీవారివంక గుడ్లురిమి చూశాడు.

'ఇంతమంది నుంచోడానికి చోటు లేకుండా వుంటే మీరు పడుక్కోవడం, మంచిదికాదు లేవండి' అన్నారు శ్రీవారు—

వాడు ఎగాదిగా శ్రీవారి వంకచూచి లేవను— 'మేము మద్రాసునుంచి వస్తున్నాం—కలకత్తా పోతున్నాం— అందుకని మేము లేవం' —అన్నాడు.

అయితే స్లీపరు కోచ్‌లో పోలేక పోయావా?— ఇంతమంది యిల్లా అవస్థ పడుతుంటే నువ్వు ఎల్లా పడుకుంటున్నావురా—లే...'

'నేను లేవను — నీయిష్టం వచ్చింది చేసుకో—కావాలంటే టి. సీ. కి. రిపోర్టు చేసుకో - గార్డుకు చేసుకో—రైల్వేమంత్రికి చేసుకో—ఇందిరాగాంధికి చేసుకో'—అన్నాడతను.

శ్రీవారి ముఖం కందగడ్డయింది!

'పోనిద్దురూ ఎందుకొచ్చిన గొడవ—ఎల్లాగోఅలా అవస్థపడదాం' అన్నానునేను—

ఇంతలో కండలు తిరిగి కోరమీసాలతో—అచ్చు సినిమా విలన్ కిలావున్న ఒకాయన ముందుకు వచ్చి—'ఎవరికీ రిపోర్టు యివ్వక్కర్లేదు—ముందు మర్యాదగా లేస్తావా? లేకపోతే ఎత్తి బయటకు విసరివేయమంటావా' అన్నాడు—

పడుకున్న అతను — ఆ భీకరమూర్తిని చూశాడు — మాట్లాడకుండ లేచి ఒదిగి కూర్చున్నాడు. 'సినీ విలన్' తను కూర్చుంటూ 'కూర్చో అమ్మా ..మీరుకూడా కూర్చోండి' అని శ్రీవారితో అన్నాడు—శ్రీవారు 'థ్యాంక్‌యూ వెరీమచ్' అంటూ అస్పష్టంగా గొణిగారు.

విజయవాడలో దిగి బందరు బండి ఎక్కాం - పాపం శ్రీవారు అంతహుషారుగా లేరు...కాఫీ ఫలహారాలు పూర్తయ్యాయి—

బండి కదిలింది—చల్లనిగాలి గిలిగింతలు పెడ్తుంటే శ్రీవారు తిరిగి మామూలు మనిషయ్యారు.

టిక్కెట్టు కలక్టర్ బండిలో ప్రవేశించి టిక్కెట్లు 'చెక్'చేస్తూ మాదగ్గరకువచ్చాడు.

శ్రీవారు పర్సులోంచి రెండు టిక్కెట్లు తీసి యిచ్చారు టిక్కెట్టు కలక్టర్ వాటి వంక ఎగాదిగా చూస్తూ సార్ మీరు ఏస్టేషనులో ఎక్కారు? ఎక్కడకి వెళ్తున్నారం'టూ ప్రశ్నించాడు.

'చీరాలలో ఎక్కాం — మచిలీపట్నం వెళ్తున్నాం' అన్నారు శ్రీవారు.

'అయ్యా! ఏ నెల్లూరినుంచి చీరాలకు వెళ్లే టిక్కెట్లు— చీరాలనుంచి మచిలీపట్నంకు తీసుకున్న టిక్కెట్లు ఇవ్వండి' అన్నాడు టిక్కెట్టు కలక్టరు—

'ఆఁ!' అని నోరుతెరిచారు శ్రీవారు, ఆశ్చర్యంగా. వారితోపాటు నేనూను—

నామాలవాడునా కళ్లముందు మెదలాడు. ●

## శివుడికి తలనొప్పి

కం. 'గిరిశా! ఏమీ మధ్యని
తరచుగ తలనొప్పి మీకు తగులుచు
నుండెన్?'
'గిరిజా! కవిత్వమంటూ
అరుదగు సరుకౌటచే దిగుమతై
నదిలేవే.'

కం. 'ఏదో తెలియక రాస్తే
మీకేం పోయింది? బాధమీకేం?
శివా!'
'కాదే, వారం వారం
ఊదరగొట్టేసి చంపుతున్నారుకదే!'

కం. 'అది మీ రెందుకు చదివిరి
కుదురుగ తాండవమువేర్చుకొనకుండ
శివా!'
'చదువక చస్తానా మరి
అదినా అంకిత మొసంగిరట శర్వాణి!'

కం. 'అంకితములు పుచ్చుకునే
వెంకయ లందరును చదివివేస్తున్నారా
శంకర! భక్త వశంకర!
ఇంకా ఈ దొడ్డిదోవనే ఉన్నారా?'

కం. 'మల్లయ్యా అని నాచెవి
చిల్లులు పడ అరచుచేమిచేతునె
పారూ!'
'వెల్లుల్లి నూరితేనా?
బెల్లము సున్నమ్ము పట్టు వెయ
మంటారా?'

కం. 'పట్టెందుకు కాని ఆ
గూట్లో ఒక ఏస్ప్రిరీను గోళీఉంటే
పట్టుకురావే— ఇహపై
ఒట్టు సుమీ కవిత ముట్టుకుంటే
గౌరీ!'

—'శిశిర'

# ఇతను రాజు

క్లాసులో మానిటర్ • క్రికెట్‌లో నేర్పరి • ఎంతో చురుకైన వాడు



# అదే, అసలైనదే అతనికి కావాలి

రాజు, తను ఎంతో త్వరగా పెరిగి, అన్నిటిలోను ప్రథముడుగా అవవలెనని తహ తహలాడుతున్నాడు. ఆ ఆశయమును నెరవేర్చుటకు అతని తల్లి రాజుకు ప్రతిరోజు "హార్లిక్స్" ఇస్తుంది — అత్యుత్తమమైన, సాటిలేని "హార్లిక్స్".

పిల్లల పెరుగుదలకు కావలసిన అదనపు పోషణ మరియు ప్రోటీన్ల కోసం ఆమె "హార్లిక్స్" మీద ఆధారపడుతుంది. ఎందుకంటే, "హార్లిక్స్"లో శుద్ధమైన, పూర్తి మీగడ గల పాలు, ఉత్తమమైన గోధుమ మరియు ప్రకృతి సిద్ధమైన ఆరోగ్యకరమగు ఇతర పోషక పదార్థములు వున్నాయి. 80 సంవత్సరములకు పైగా తల్లులు "హార్లిక్స్" మీద ఆధారపడుతున్నారు మరియు డాక్టర్లు దానిని సిఫారసు చేస్తున్నారు.

మీరు, మీ కుటుంబములోని వారు ఉత్సాహముతో వుండండి—ప్రతి రోజు "హార్లిక్స్" త్రాగండి. "హార్లిక్స్" <u>ఉత్తమ</u> పోషకత్వమును, <u>అధిక శక్తిని</u> ఇస్తుంది.




## అదే, అసలైనదే 'హార్లిక్స్'

"హార్లిక్స్" అనే పేరు రిజిస్టర్ చేయబడిన ట్రేడ్ మార్కు

HL 1844 a

# రైతు బిడ్డ

# సినిమా

జమీందారు జగపతిరావు మొదటిభార్య కుమారుడు రాము. భార్య పోవటంతో—రాముకి తల్లిలేని లోటు తీర్చడానికిగాను లక్ష్మీదేవిని రెండవ వివాహం చేసుకున్నాడు. చిన్నకొడుకు ప్రసాద్‌కన్న రామును ఎక్కువప్రేమతో చూసి పెంచింది లక్ష్మీదేవి. జగపతిరావుగారూ కన్ను మూశారు. పోయేటప్పుడు ఆయన తన యావదాస్తినీ పెద్దకొడుకుపేరిట విల్లు రాశారు

లక్ష్మీదేవిని ఎన్నడూ సవతితల్లిగా భావించని రాము—ఆమెను దైవస్వరూపిణిగా ఎంచాడు. తమ్ముడు ప్రసాద్, తనూ ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. ఆ ఊళ్లోని మరో పెద్దరైతు భూషయ్యకి జగపతిరావు కుటుంబమంటే మొదటినుంచీ కక్ష ఉంది. భూషయ్యకు ఒకే ఒక కుమార్తె. పేరు రాధ. ప్రసాద్ చదువుకుంటున్న కాలేజీలోనే చదువుకుంటోంది వారిద్దరు ప్రేమించుకుంటారు.

ఆ గ్రామానికి సేవికగా వచ్చిన శాంత—రాముని ఆకర్షించి అతని హృదయంలో చోటు చేసుకుంటుంది. రామును ఆమె కూడా ప్రేమిస్తుంది.

తన కుమార్తె రాధను వివాహం చేసుకోవాలంటే ఒకషరతు పెడతాడు భూషయ్య. ఆస్తిలో సగభాగం ప్రసాద్‌పేర ఉండాలనేది ఆ షరతు. భూషయ్యకుట్ర తెలిసి ప్రసాద్ — ఆస్తిలో సగంవాటా పంచమని తల్లితో ఘర్షణపడి అన్నగార్ని వంచకుడుగా ఎంచి దూషించాడు.

గ్రామ పంచాయితీ పెద్దలముందు యావదాస్తినీ తమ్ముడిపేర రాస్తున్నానని రాము ప్రకటించగానే— అంతేకాదు; అతనికి పుట్టబోయే సంతానానికి కూడా ఆ ఆస్తిమీద ఏవిధమైన హక్కూ ఉండదనీ కూడా రాసివ్వమన్నాడు భూషయ్య అందుకు రాము సమాధానంగా— తాను జీవితాంతం బ్రహ్మచారిగానే ఉంటానని ఆ పెద్దలముందు ప్రమాణంచేసి పత్రాలమీద సంతకం పెట్టాడు.

మరి, రాము పెళ్లాడతానని శాంతకిచ్చిన మాట ఏమవుతుంది? విడిపోయిన అన్నదమ్ముల్లిద్దరూ [illegible]?

—రాముగా పద్మశ్రీ ఎన్. టి. రామారావు, అతని తల్లిగా శాంతకుమారి, ప్రేయురాలిగా వాణిశ్రీ, ప్రసాద్‌గా జగ్గయ్య, రాధగా అనురాధ, భూషయ్యగా సత్యనారాయణ నటించారు. పినిశెట్టి సంభాషణలు సమకూర్చిన యీ చిత్రానికి యస్. హనుమంతరావు సంగీత దర్శకుడు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : బి. ఏ. సుబ్బారావు. నిర్మాత : కోట్ల వెంకట్రామయ్య.

అంధ్రప్రదేశ్‌లో యీ చిత్రం మే 19న విజయావారిద్వారా విడుదలై విజయవంతంగా ప్రదర్శింపబడుతున్నది.

— మోహన్‌కుమార్



ఈ 'వనిత' ఎవరో 'రైతుబిడ్డ' సినిమా చూస్తే తెలుస్తుంది. (చూడకపోయినా తెలియవచ్చు!)

## పవిత్ర ఆశయంకోసం ప్రాణాలర్పించిన స్త్రీ

స్త్రీకి సౌభాగ్యాన్ని, సంతోషాన్నియిచ్చేది మాంగల్యం ఒక్కటే. భూమిపై పుట్టిన ప్రతిస్త్రీ జీవితంలో కోరుకునేది, కళ్ళకద్దుకునేది. మంగళసూత్రాన్నే. యుక్తవయస్సుకు రాగానే, ప్రతిస్త్రీ తన వైవాహిక జీవితాన్ని గురించే కోటికలలు కంటుంది. వివాహం వేశ్యలకు నిషేధమా? వాళ్ళు చేసిన పాపమేమిటి? ప్రకృతిలో ఆడ మగ అనే తెగలు రెండే వున్నాయి. జాతి, మత, విభేధాలను యేర్పరచింది మనం. ఒకకులంలో పుట్టినవాళ్ళు ఆ కులవృత్తిని అవలంబించే తీరాలా? వేశ్యకులంలో పుట్టినంతమాత్రాన వివాహం చేసుకోకూడదా? ఆ స్త్రీలను పెండ్లి చేసుకునే సాధులే లేరా? సంఘంలో మూఢనమ్మకాల ప్రభావానికి ఒకజాతి బలి కావలిసిందేనా? ఎక్కువకులంలో పుట్టినవాళ్ళకు చెడుబుద్ధులు రాకూడదా? తక్కువకులంలో మణిపూసలు పుట్టరాదా? కులంలో ఏముంది? మనస్సులో, మనుగడలో పవిత్రత వుంటే, ఏ జాతిస్త్రీ అయినా పూజింపబడాల్సిందే. మాంగల్యం కోసం ధనప్రాణాలను తృణప్రాయంగా యెంచి, ఆ పవిత్ర ఆశయ సిద్ధికోసం అసువులు బాసిన ఒక జాతిరత్నం యొక్క కరుణామయ గాథయే మధుసూదన్‌వారి 'కళ్యాణ మంటపం'. దర్శకుడు మధుసూదనరావు 'కళ్యాణ మంటపం' చిత్రాన్ని సర్వజనరంజకంగా చిత్రించారు. స్త్రీజాతి ఔన్నత్యాన్ని, శీలసంపదను ప్రతిబింబింపచేసే చక్కటి చిక్కటి సమస్యాత్మక చిత్రమే 'కళ్యాణమంటపం' దినదిన ప్రవర్ధమానమయ్యే యీ సంఘంలో సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని, సర్వోదయ సిద్ధాంతాన్ని ప్రచారం చెయ్యాలనే వుద్దేశ్యంతోనే మధుసూదనరావు యీచిత్ర నిర్మాణానికి పూనుకొన్నారని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఈ సంచలన చిత్రానికి బొల్లిముంత మాటలు [illegible]



'సతీ అనసూయలో' నర్మద పాత్ర వహించే శారద.

ఛాయాగ్రహణం, సత్యం కూర్పు బాగా సహకరించడంవల్ల, నటీనటులు అందరూ పాత్రలకు అతికినట్టుగా నటించడంవల్ల, యీ చిత్రం ప్రేక్షకుల అభిమానం పొంద గలదు.

## సూర్యకాంతం

## డబ్బుదాహం

గయ్యాళిపాత్రలకు పెట్టింది పేరు సూర్యకాంతం; తెరపై ఆమెను ఆ పాత్ర లోనే చూడడానికి అలవాటు పడ్డారు ప్రేక్షకులు- కానీ ఆమె ఏపాత్రకయినా పరిపూర్ణ న్యాయం చెయ్యగలదు. విశ్వ భారతి ప్రొడక్షన్స్ నిర్మించిన 'శ్రీమం తుడు' చిత్రంలో సూర్యకాంతం— పిల్లి వేషం ధరించింది. కాదు—కాదు...జీవిం చింది. డబ్బుదాహం పట్టుకున్న ఆమె, అభంశుభం యెరుగని ఒక అమాయక ప్రాణంతో చెలగాట మాడుతుంది. 'చింత చచ్చినా పులుసు చావదు' అనేవిధంగా తన్ను పోలీసులు అరెస్టుచేసి తీసికెడుతున్నా 'డబ్బో డబ్బో' అంటూ వెర్రివెర్రిగా అరుస్తూ పోతుంది. ఈ పాత్రలో కొత్త సూర్య కాంతం కనిపిస్తుంది.

# సినిమా డైరి

● పి. ఏ. పి. కలర్ చిత్రం యొక్క మొదటి పాటను ఆచార్య ఆత్రేయ వ్రాయగా, ఘంట సాలచే మహదేవన్ మే 15న జెమినీలో పాడించారు. తాతినేని దర్శకుడు.

● 'శ్రీమంతుడు' మే 17 నుండి 21 వరకు రీ—రికార్డింగును పూర్తి చేసుకున్నాడు. కె. ప్రత్యగాత్మ దర్శకుడు.

● 'అదృష్ట జాతకుడు' మే 15 నుండి 20 వరకు ప్రసాద్‌లో షూటింగు జరుపు కున్నాడు. రామారావు, వాణిశ్రీలు పాల్గొన్న సన్నివేశాలను, పాటను హేమాంబరధరరావు చిత్రీ కరించారు.

● నవభారత్ మూవీస్ 'రైతు కుటుంబం' పదకొండు రీళ్ళు తయారైంది. తాతినేని దర్శ కుడు. నాగేశ్వరరావు నాయకుడు.

● మధు మూవీస్ 'కళ్యాణ మంటపం' కలర్ చిత్రం జూన్ 25న విడుదలవుతుంది.

● డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి అవుట్‌డోర్ షూటింగు మే 22 నుండి 25 వరకు పీతనూర్‌లో జరుగుతుంది. వాణిశ్రీ, శోభన్ పాల్గొంటారు. కె. విశ్వనాద్ దర్శకుడు.

అక్కినేని అగ్రసివ్ యాక్టింగ్ ఈ చిత్రానికి పేయింగ్ ఎలిమెంట్ అంటే అతిశయోక్తి కాదేమో? జమున అందంగా వుండడమేగాక, అత్యంత సహజంగా నటించిదం కూడా. అక్కినేని తండ్రిగా నరసింహరావు

## సినిమా

అనే కొత్త నటుడు, కనిపించే కాస్సేపూ బాగా నటించాడు. గుమ్మడి గాంభీర్యం, రాజబాబు హాస్యం గురించి వేరే చెప్పాలా?

ఈ చిత్రం ప్రత్యగాత్మకు మంచి పేరున్నీ, నిర్మాత రాధాకిష్ణమూర్తికి మంచి డబ్బును, సంగీత సారధి చలపతిరావుకు మంచి డిమాండును తెచ్చిపెడుతుంది. 'భార్యాభర్తలు' చిత్రంలాగా 'శ్రీమంతుడు' కూడా ప్రతి ఆంధ్రుడ్నీ ఆకర్షిస్తుంది.

## మంచి రోజులు

ప్రాణప్రదంగా ప్రేమించిన భార్య అకాల మరణానికి గురికావడం వల్ల, రాజనాల మనస్సు ఆందోళన పడింది. చెడ్డరోజులు వస్తే అన్ని కష్టాలు ఒకేసారి మనిషిని పీడిస్తాయి. అందుకే రాజనాల కొన్ని రోజులు కష్టానికి గురి అయ్యారు. ఇప్పుడు రాజనాలకు మంచిరోజులు వచ్చాయి అని చెప్పొచ్చు. కారణం—నాటక రంగంలోనయితేనేమి, సినిమా రంగంలోనయితేనేమి రాజనాలకు హెవీ డిమాండ్ యిప్పుడు. డిమాండ్ రావడానికి కారణం లేకపోలేదు. ఆయన ప్రదర్శిస్తున్న 'పద్మశ్రీ' నాటకం ఆంధ్రుల కభిమాన పాత్రమయింది. అలాగే 'సుపుత్రుడు' 'రైతుబిడ్డ'లో ఆయన

కుటుంబ సమేతంగా
చూచి ఆనందించండి!




లక్ష్మీ కళా చిత్ర వారి

# రైతుబిడ్డ

దర్శకత్వం.
బి.ఏ. సుబ్బారావు

నిర్మాత కోట్ల వెంకట్రామయ్య
నిర్వహణ మేడా వెంకటరమణమూర్తి
సంగీతం ఎస్. హనుమంతరావు

VIJAYA

పంపిణీదారులు: ఆంధ్ర విజయా కంబైన్స్ సీడెడ్ బలరామ్ పిక్చర్స్ నైజాం ఎస్.ఎస్.పి.పి

STUDIO Rekha

ధరించిన పాత్రలు ప్రేక్షకుల అమోఘమైన ఆదరణను సంపాయించాయి. అందుకే యిప్పుడు రాజనాలకు మంచి గిరాకీ.

## ఇద్దరు హీరోలు కలిసి నటిస్తారా ?

ఇదీ నేటి సమస్య. ఎందుకీ ప్రశ్న వుదయించిందో మీకు చెప్పాలిగా. నాగేశ్వరరావుగారి అమ్మాయి పెండ్లికి రామారావుగారు రావడంవల్ల, ఈ పుకారును లేవదీసారు కొందరు. ఇద్దరూ మహానటులని మీరందరూ అంగీకరించారు. ఇద్దరూ కలిసి నటించిన చిత్రాలను ఆదరించారు. ఇప్పుడు వాళ్ళు కలిసి నటిస్తే ఏం ? అలాంటి మంచిపని జరిగిననాడు పబ్లిసిటీ పోస్టర్లపై పేడముద్దలు కనిపించవు. వాళ్ళ బొమ్మలపై పిచ్చిగీతలు గీసేవాళ్లు వుండరు. పైగా హీరో లిద్దరికీ విరోధాలో, వైషమ్యాలో వున్నాయని భావించడం మన తప్పు. వాళ్లిద్దరూ ఎన్నోసార్లు, పెండ్లిండ్లలో, సభలు, సమావేశాల్లో కలిసి యున్నారు. నవ్వుతూ మాట్లాడుకున్నారు. అక్కినేని రామారావును పెండ్లికి రమ్మని ఆహ్వానించారు. తమ్ముడి ఆహ్వానాన్ని అన్నయ్య గౌరవించారు. ఇద్దరూ తమ గొప్ప వ్యక్తిత్వాన్ని ఋజువు చేసుకున్నారు. మద్రాసులో ఏ స్టుడియోకెళ్ళినా, ఏ సినిమా కంపెనీకి వెళ్లినా 'రామారావు, నాగేశ్వరరావులు కలిసి నటిస్తారటగా' అనే ప్రశ్నను వేస్తున్నారు. వీళ్ళిద్దరూ కలిస్తే, మరొక లాభం కూడా వుంది. చిత్రాల విడుదల రద్దీ తగ్గుతుంది. పెద్ద పిక్చర్లను తీసే నిర్మాతలకు లాభాలు రాకపోయినా, పెట్టుబడికి యిబ్బంది రాకుండా వుంటుంది. కాబట్టి హీరోలు కలిస్తే పరిశ్రమకు మంచే జరుగుతుంది.

## వాణిశ్రీ జావళీ

వాణిశ్రీ, దేవిక ఒకర్ని విడచి ఒకరు వుండలేనంత స్నేహితులు. తన చెలి దేవికకు పెండ్లి అని తెలియడమే తరువాయి, వాణిశ్రీ గంపెడాశతో వచ్చింది. స్ఫురద్రూపి, అందగత్తె, గడుసరి అయిన వాణిశ్రీ మంచినర్తకి కూడా. ఆ పెళ్లి శోభను జాజ్వల్యమానం చేసేందుకు గజ్జె కట్టింది.

ఏమని తెలుపనురా...స్వామీ
ఏమని తెలుపనురా

తొలిచూపులోనే ఏగిలిగింతలాయెనో,—

అంటూ సిగ్గుపడుతూ, మరోవైపు సోయగాలు వొలకబోస్తూ చేసిన నృత్యం అక్కడికి విచ్చేసిన వారందరినీ ఆనంద డోలికల్లో ముంచెత్తి వేసింది. నటిగా శిఖరాగ్రాలని అందుకుంటున్న వాణిశ్రీ నర్తకిగా కూడా అనుభవజ్ఞురాలనిపిస్తుంది. వెంపటి సత్యం నృత్యదర్శకత్వంలో వాణిశ్రీ ప్రదర్శించిన జావళీనృత్యం డి. వి. ఎస్. ప్రొడక్షన్స్‌వారి తాజా చిత్రానికి ఒక హైలైటు. కవి నారాయణరెడ్డి వ్రాసిన పైపాటను టి. వి. రాజు సంగీత సారధ్యంలో సుశీల కమ్మగా పాడింది. ఇప్పటికి అయిదురీళ్ల చిత్రం తయారైంది. కె. విశ్వనాథ్ దర్శకత్వంలో తయారవుతున్న యీ చిత్రంలో ఎన్టీఆర్, వాణిశ్రీ, దేవిక, జగ్గయ్య, శోభన్‌బాబు, రాజబాబు. రాజనాల, అల్లు రామలింగయ్య ముఖ్యపాత్రధారులు. డి. వి. ఎస్. రాజు నిర్మించే యీ సాంఘికానికి సముద్రాల మాటలను, కళాధర్ శిల్పాన్ని, ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం సెప్టెంబరులో విజయాకంబైన్స్ ద్వారా విడుదలవుతుంది.

## రామారావు రాజనాలలపోరు

హారాహుషార్! త్వరలోనే యుద్ధం రాబోతూంది. ఎవరెవరికని అడగరేం? మీ అభిమాన నటుడు ఎన్టీ ఆర్‌కు, విలన్ రాజనాలకీ యీ యుద్ధం. నిజమనుకునేరు సుమా! అవును. ముమ్మాటికీ నిజమే. జీవి

## మీకు తెలుసా?

భారత రాష్ట్రపతి వరాహగిరి వెంకటగిరిగారి సతీమణి శ్రీమతి సరస్వతీగిరిగారు నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావుపై పద్యాలు వ్రాసారని మీకు తెలుసా?

నటి జయలలితను ఆమె ఆప్తులు ఆప్యాయంగా 'అమ్ము' అని పిలుస్తారట.

ఒకప్పుడు వాంప్ పాత్రలను పోషించడంలో దిట్ట అనిపించుకున్న విజయలలిత యిప్పుడు 'హీరాయిజమ్' వున్న నాయిక పాత్రలకు పెట్టింది పేరై కూర్చుంది.

నటుడు నాగభూషణం త్వరలోనే విదేశయానం చేస్తారట.

మధు మూవీస్‌వారి 'కళ్యాణమంటపం' చిత్రాన్ని మే 16న రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి, కొత్త కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ సంజీవయ్య చూసి, దర్శకుడు మధుసూదనరావును అభినందించారట.

తంలో కాదు. సినిమాలోనే. '(శ్రీకృష్ణాంజ నేయ యుద్ధం' చిత్రంలో కృష్ణ పాత్ర ధారి రామారావును, అంజనేయ వేషధారి రాజనాల ఢీకొంటాడు. ఈ రసవత్తర మయిన కధను 'బాలనాగమ్మ' నిర్మాత డి. ఎన్. రాజా భారీ యెత్తున నిర్మిస్తున్నారు. సి. ఎస్. రావ్ దర్శకుడు; సముద్రాల రచయిత. టి. వి. రాజా సంగీత సారధి. ఎన్టీఆర్, వాణిశ్రీ, ఎస్వీరంగారావు, రాజనాల, రాజబాబు, కాంతారావు ముఖ్య తారాగణం. ఈ చిత్రానికి గాను విజయా గార్డెన్స్‌లో ఏప్రిల్ 30న ఒకపాట రికార్డు చెయ్యబడింది. దాశరధి వ్రాసి, ఘంటసాల పాడిన ఆ పాటను మీరూ వింటారా ?

నీల మేఘశ్యామా
శుభనామా గుణధామా
యదుకుల సోమా' — ఈ పాటను నారదుడు, శ్రీ కృష్ణుని స్తుతిస్తూ ద్వారకలో పాడుతాడు.

## ...అచ్చ తెలుగు అందం

మాడరన్ థియేటర్స్ 110వ చిత్రం నేనూ మనిషినే' షూటింగు పూర్తయి, సెన్సారుకు సిద్ధంగా వుంది. డా. నారాయణరెడ్డి వ్రాసిన 'పాలరాతి మందిరాన పడతి బొమ్మ అందం, అనురాగ గీతిలోన అచ్చ తెలుగు అందం' అనేడి పాటను కాంచన, కృష్ణలపై దర్శకుడు శేషగిరిరావు సేలంలో చిత్రీకరించారు. అపూర్వమయిన న్యాయాధిపతి పాత్రను అత్యంత ప్రతిభావంతంగా పోషించారట గుమ్మడి. ఈ చిత్రంలో కనిపించే ప్రధాన పాత్రలను గుమ్మడి, కృష్ణ, కాంచన, సత్యనారాయణ, శ్రీదేవి, కె. వి. చలం, సురేఖ, జయకృష్ణ, శకుంతల, పొట్టి ప్రసాద్, రామచంద్రరావు, అర్జా జనార్దన రావులు పోషించారు. సెంటిమెంటు+ సస్పెన్సు సమ్మిళితమయిన ఈ కధకు రాజశ్రీ మాటలను సమకూర్చారు. స్వర్గీయ వేదా సంగీతాన్ని, మణి ఛాయను నిర్వహించారు. నవయుగ విడుదల.

## విదేశీయులను ఆకర్షించిన తెలుగు గాయకుడు

నేపధ్యగాయకుడు పి. బి. శ్రీనివాస్ వేషంలో, భాషలో, నడతలో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. ఆయనకు ఎనిమిది భాషలు వచ్చు, వుర్దూలో మూ౦వి పాండిత్యం వుంది. ఇటీవల యింగ్లీషులో కూడా ఒక చక్కటి పాటను వ్రాసి, ఆయన, ఎస్. జానకి కలిసి పాడారు.'చంద్రునిపై మానవుని పాదం' అనేడి ఈ పాటను కొలంబియా వాళ్లు గ్రామఫోను రికార్డుగా విడుదల చేసారు. పి. డి. 3683 నెంబరుగల ఈ ఇంగ్లీషు రికార్డు విదేశీయులను విపరీతంగా ఆకర్షించింది. అమెరికాలోని ప్రముఖు లనేకులు శ్రీనివాస్ మేధా సంపత్తిని ప్రశంసిస్తూ వుత్తరాలు వ్రాసారు. తెలుగువాళ్ళు కూడా ఈ పాటను ప్రోత్సహించగలరనే నమ్మకం పి.బి.ఎస్.కు వుంది. పాటలో దమ్ము వుంది గనకనే మీరందరూ దాన్ని ఆదరించగలరనే నమ్మకం తనకున్నట్లు శ్రీనివాస్ చెప్పారు.

## సారధి స్టుడియోలో ప్రత్యేకత

హైద్రాబాద్ సారధిస్టుడియోలో వున్న

"షికడాలీ'ని చూసాను. ఇండియాలో యిలాటి డాలీ యిక్కడే వుందట. వెం 95 వేలు అని ప్రసాదరావు చెప్పారు. 'డాలీ'ని ఆపరేట్ చెయ్యగా చూశాను. ఏ యాంగిల్‌లో తిరగమన్నా దానంతట అదే తిరుగుతుంది. స్టుడియోలో నాలుగు ఫ్లోర్సు వున్నాయి. విశాలంగానే వున్నాయి. అన్ని సౌకర్యాలు వున్నాయి. కానీ పని తక్కువగా వుండడంవల్ల, స్టుడియో లాస్‌లో రన్ అవుతూవుంది. లాబరెటరీని చూసాను. సారథిలో ప్రింటింగు చాలా బాగుంటుంది. థియేటరును చూసాను. ప్రొజెక్షన్ చాలా నీట్‌గా వుంది. సౌండు క్లియర్‌గా వుంది. స్టుడియోలో కొత్తగా ఏ. సి. మేకప్‌గదులు కడుతున్నారు. హైదరాబాదు నగరానికి సారథిస్టుడియో ప్రత్యేక శోభను తెచ్చిపెడుతూంది.

## కొట్టొచ్చినట్లు కనిపించే లోపాలు

ఇటీవల వచ్చే సినిమాలను పరిశీలించండి. కొన్నిచిత్రాల కథల్లో మార్పు కనిపించదు. నాయికీ నాయకుల డ్రస్సులోగాని, హేర్ స్టైయిల్‌లోగాని మార్పు కనిపించదు. నటీ నటుల యాక్టింగ్‌లో యింప్రూవ్‌మెంట్ కనిపించదు. దర్శకుడికి, కథకుడికి పొత్తు కుదిరినట్టు కనిపించదు. సంగీతంలో పాత చింతకాయ పచ్చడితప్ప మరేదీ వినిపించదు. విడుదలచేసే విషయంలో నిర్మాతల్లోనూ, పంపిణి దార్లలోనూ సామరస్యం కనిపించదు. ఇన్నిలోపాలు కొట్టొచ్చినట్లు కనిపిస్తూవుంటే, ఏ చిత్రమయినా ప్రేక్షకుడి ఆదరణకు ఎలా పాత్రమవుతుంది? అందుకే పదిచిత్రాలు విడుదలయితే, బాగావున్న ఒక్క చిత్రానికే మిగతా 9 చిత్రాల డబ్బు కూడా పోతుంది. ఈ సమస్యను పరిష్కరించే దెవరు ?

## కొత్తవారిని ఆదరించరా?

ఆంధ్రదేశంలో అందగాళ్ళు, అందగత్తెలు లేనేలేరా? నటించే శక్తి కొద్దిమందికయినా వుండదా? పెద్ద నిర్మాతలు నెలకొకసారి ఆంధ్రదేశంలోని పలు కేంద్రాలకు వెళ్ళి అక్కడక్కడ 'ట్యాలెంట్‌హంట్ కంటెస్ట్' జరిపితే ఫలితాలు ఆరోగ్యకరంగావుండే అవకాశం లేదంటారా? బిజీ తారలకు వేలకువేలు యిచ్చికూడా, ప్రయోజనాలు తక్కువగా కనిపిస్తున్న ఈ రోజుల్లో, కొత్తవాళ్ళను పరిచయం చేస్తే, ప్రేక్షకులు తప్పకుండా స్వాగతం పలుకుతారు. హిందీలో ఎంతమంది కొత్తవాళ్ళు రావడంలేదు చెప్పండి? దేనికయినా ధైర్యం వుండాలి. పిరికితనం పోవాలి. ప్రేక్షకులకు కావలసిందల్లా మంచికథ, హుషారయిన సంగీతం చక్కటి టెక్నిక్, నూతనత్వం (కథా పాత్రల్లో) అంతే కాబట్టి ప్రముఖ నిర్మాతలు కొందరయినా ఒక కమిటీగా చేరి, కొత్త రక్తం కోసం ప్రయత్నించడానికి యిదే మంచి తరుణం.

—శ్రీనివాస్ ●



లతా మంగేష్కర్ సంగీతానికి ఎనలేనిసేవ చేసింది. ఈ నాటికీ చేస్తూనే ఉన్నది. కన్యాకుమారి నుంచి హిమాలయాల వరకూ ఆమెగొంతు ప్రతి గంటకీ వినిపిస్తూనే ఉంటుంది. ఆమె పాడని పాట లేదు. ఆ గొంతు పలుకని రాగం లేదు. పడుచువాళ్ళ నుంచి పండు ముసలివాళ్ళ వరకూ ఆమె గొంతు ఎంతో గుర్తు.

లతావలెనే ఆమె కుటుంబ సభ్యులంతా కూడా సంగీతంలో నిష్ణాతులే! చెల్లెళ్ళు ఆశాభోన్స్లే, ఉషా మంగేష్కర్, మీనా, తమ్ముడు హృదయనాథ్ మంగేష్కర్—ఇదీ ఆ కుటుంబం. లతా చెల్లెళ్ళు అందరూ నేపథ్య గాయనీమణులుగా ఉత్తరాది చలన చిత్ర పరిశ్రమలో అగ్రస్థానం వహించారు. హృదయనాథ్ కూడా బాగా పాడగలడుగని, ఆయన సంగీత దర్శకుడిగా స్థిరపడ్డాడు. మరాఠీలో అనేక చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించి లేత వయసులోనే మంచి పేరు గడించుకున్నాడు.

ఆ కుటుంబంలో అందరికన్న పెద్దది లతా. తండ్రి దీనానాథ్ మంగేష్కర్ ఆమె 12 వ ఏట పోతే, చెల్లెళ్ళనీ, తమ్ముణ్ణీ పెంచి పెద్దజేసి, సంగీతంలో నిష్ణాతులను చేసి పెళ్ళిళ్ళు చేసింది. తనకన్న చిన్నవాళ్ళయిన వాళ్ళంతా పెళ్ళిళ్ళయి ఎవరి బ్రతుకు వారు బ్రతుకుతున్నా—లతా మాత్రం ఇంకా పెళ్ళి చేసుకోలేదు. ఈనాటికీ ఆమె కుమారిగానే ఉన్నది.

* * *

లతా మంగేష్కర్ తిరుమల శ్రీ వెంకటేశ్వరస్వామివారి ఆలయంలో ఆస్థాన సంగీత విద్వాంసురాలుగా నియమించబడినట్లు లతా తండ్రి దీనానాథ్ మంగేష్కర్ 30 వ వర్ధంతి సభ యీమధ్య హైదరాబాద్‌లో

## సముచిత నిర్ణయం

జరిగినపుడు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ఆ సభలో వెల్లడి చేశారు. మన ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు చెప్పినట్టు ఈ వార్త ఎంతో సంతోషదాయకమైనది.... అంతేకాదు. లతాను నియమించటానికి తీసుకున్న నిర్ణయం ఎంతో సముచితమయినది కూడా!

### ప్రణయ వివాహం

అందాల హిందీతార బబిత పెళ్ళికూతురు కాబోతున్నది. వరుడెవరో మీలో కొందరికి తెలిసే ఉండవచ్చు. ప్రముఖ నటుడు రాజకపూర్ కొడుకు రణదీర్‌కపూర్. 'డబ్బూ'గా యితను ఫిలిం ప్రపంచంలోని వారికి పరిచితుడు. రాజకపూర్ దగ్గర అసిస్టెంట్‌గా పనిచేసి పేరెన్నికగన్న దర్శకుడయిన లేక్ టాండన్ దగ్గర రణదీర్‌కపూర్ అసిస్టెంట్ డైరెక్టరుగా కొన్ని చిత్రాలకు పని చేశాడు. ఇపుడు హీరో కూడా అయాడు.

ఇపుడు రణదీర్‌కపూర్—కల్,ఆజ్,అవుర్ కల్ అనే చిత్రం స్వంతంగా నిర్మిస్తున్నాడు. ఈ చిత్రానికి అతనే దర్శకుడు. హీరో కూడా అతనే. బబిత హీరోయిన్. వీరిద్దరికీ పెళ్ళి ఖాయం అయింది. మే 12 వ నిశ్చితార్థం జరిగింది.

అయితే యీ పెళ్ళి పెద్దలు నిర్ణయించక ముందే వారిరువురూ ప్రేమించుకున్నారు. ఈ ప్రణయం వారిమధ్య ఆరంభమయినపుడే కొన్ని పత్రికలు పసిగట్టి, పని గట్టుకుని ప్రచురించాయి. తామిద్దరం స్నేహితులమనీ (చదువుకునే రోజుల్నుంచి) అంతకుమించి తమ మధ్య ఏమీ లేదనీ వారు చెప్పినట్టు బొంబాయి పత్రికలు ప్రచురించాయి. ఇది అప్పట్నుంచీ సాగుతున్న ప్రణయమని ఇప్పుడు రూఢి అయింది. వారి వివాహం డిసెంబరులో జరుగగలదని తెలుస్తున్నది.

—మోహన్ కుమార్

Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

